17) d రైలు పొడవు x మీ అనుకుంటే, 5 సెకన్లలో అది మైలురాయిని దాటింది కనుక దానివేగము = $\frac{\text{దూరము}}{\text{కాలము}} = \frac{x}{5}$ అలాగే వంతెనను 20 సెకన్లలో దాటినది. కనుక వేగము = $\frac{x + 150}{20}$ మీ/సె.

ఈ రెండు సమానము.కనుక $\frac{x}{5} = \frac{x + 150}{20}$ అడ్డ గుణకారము చేస్తే $20x = 5x + 750$ అనగా $15x = 750 \Rightarrow x = \frac{750}{15} = 50$ మీ., సెకనుకి వేగము $= \frac{50}{5} = 10$ మీ గంటకు వేగము $= 10 \times \frac{18}{5} = 36$ కి.మీ/ గం

18) a రైలు వేగము (సెకనుకు) $= 54 \times \frac{5}{18} = 15$ మీ/సె., ఈ రేటున 10 సెకన్లలో పోయిన దూరము $= 10 \times 15 = 150$ మీ. కాని ఈ దూరము (వంతెన + రైలు) మొత్తము పొడవుకు సమానము. కనుక ఆ రైలు పొడవు $= 150 - 100 = 50$ మీ.

19) a 20 a 21) c

10 సెకన్లలో రైలు $(200 + 100)$మీ. దూరమును ప్రయాణం చేసినది. అనగా సెకనుకు వేగము $= \frac{300}{10} = 30$ మీ/సె. కనుక 12 సెకన్లలో పోయేదూరము $= 30 \times 12 = 360$ మీ. ఈ దూరము ఆ రైలు పొడవు, 100 మీటర్ల వంతెన పొడవుకు సమానము. కనుక ఆ రైలుపొడవు $= 360 - 100 = 260$ మీ

22) a సెకనులో ఆ రైలు పోయేదూరము $= 54 \times \frac{5}{18} = 15$ మీ. 10 సెకన్లలో పోయేదూరము $= 15 \times 10 = 150$మీ, ఇదేవేగముతో పోతున్న రైలు 12. సెకన్లలో పోయే దూరము $12 \times 15 = 180$మీ. కనుక రెండు రైళ్ళ పొడవులలోను గల తేడా $= 180 - 150 = 30$మీ.

## బారువడ్డీ – చక్రవడ్డీ

1) దాచుకున్న సొమ్ము (అసలు), కాలము, వడ్డీరేటు తెలిసిన బారువడ్డీ ---------

a) $\frac{\text{అసలు} \times \text{కాలము} \times \text{రేటు}}{100}$ b) $\frac{\text{అసలు} \times \text{కాలము}}{100 \times \text{రేటు}}$

c) $\frac{\text{అసలు} \times \text{రేటు}}{100 \times \text{కాలము}}$ d) ఇవేవీకావు

2) వడ్డీ, వడ్డీరేటు, కాలము తెలిసిన దాచుకున్న సొమ్ము (అసలు) = --------

a) $\frac{100 \times \text{వడ్డీరేటు}}{\text{కాలము} \times \text{వడ్డీ}}$ b) $\frac{100 \times \text{వడ్డీ}}{\text{రేటు} \times \text{కాలము}}$

c) $\frac{100 \times \text{కాలము}}{\text{రేటు} \times \text{వడ్డీ}}$ d) ఇవేవీకావు

3) వడ్డీ (I), అసలు (P) కాలము (T) తెలిసిన వడ్డీరేటు -------

a) $\frac{100\,P}{I \times T}$ b) $\frac{100\,I}{PT}$ c) $\frac{100\,T}{PI}$ d) ఇవేవీకావు

4) వడ్డీరేటు (r), వడ్డీసొమ్ము (I), అసలు (P) తెలిసిన కాలము --

a) $\frac{100\,P}{Ir}$ b) $\frac{100\,r}{PI}$ c) $\frac{100\,I}{Pr}$ d) ఇవేవీకావు

5) బారువడ్డీ, దాచుకున్న సొమ్ము తెలిసిన మొత్తము (A) = ---

a) బారువడ్డీ + దాచుకున్న సొమ్ము

b) దాచుకున్న సొమ్ము −వడ్డీ

c) దాచుకున్న సొమ్ము + 2 × బారువడ్డీ

d) ఇవేవీకావు

6) మొత్తము (A) అప్పుతీసికున్న సొమ్ము (P) తెలిసిన వడ్డీ (I) = ---

a) (A + P) b) (A - P) c) (A - 2P) d) ఇవేవీకావు

7) మొత్తము (A), వడ్డీ (I) తెలిసిన అప్పుతీసికున్న సొమ్ము (P) = --------

a) (A - I) b) (A + I) c) (A - 2I) d) ఇవేవీకావు

8) చక్రవడ్డీ ప్రకారము మొత్తము కనుగొనుటకు సూత్రము (దాచిన సొమ్ము = P, రేటు = r, తిరగకట్టే సార్లు = n ఇచ్చిన)

a) $P\left(1 - \frac{r}{100}\right)^n$ b) $P\left(1 + \frac{r}{100}\right)^n$

c) $P\left(\frac{1 + r}{100}\right)^n$ d) ఇవేవీకావు

9) వడ్డీరేటు (r), తిరుగకట్టే పర్యాయములు (n) చక్రవడ్డీప్రకారము అయ్యేమొత్తము (A) తెలిసిన, ఇచ్చిన సొమ్ము (P) = ----

a) $\frac{100\ A}{(1 + r)^n}$ b) $\frac{A}{\left(1 + \frac{r}{100}\right)^n}$

c) $\frac{A}{\left(1 - \frac{r}{100}\right)^n}$ d)ఇవేవీకావు

10) చక్రవడ్డీ ప్రకరము అయ్యేమొత్తము (A), దాచినసొమ్ము (P), తిరగకట్టే పర్యాయములు (n) తెలిసిన రేటు (r) = --------

a) $100\left(\frac{A}{P} - 1\right)^n$ b) $\left[\left(\frac{A}{P}\right)^{1/n} - 1\right] \times 100$

c) $\left(\frac{A}{P} - 1\right)^{\frac{1}{n}}$ d) ఇవేవీకావు

11) ఒకడు 1000రు.లు అప్పుతీసికొని సంవత్సరము తరువాత 1025రు.లు ఇచ్చి, అప్పుతీర్చివేసిన, అతడు చెల్లించిన వడ్డీ సొమ్ము --------

a) 25 రు b) 20 రు c) 30 రు d) ఇవేవీకావు

12) 100రు.లను బారువడ్డీకి అప్పుతీసికొని, 2 సం.ల తరువాత 120 రు.లు ఇచ్చి అప్పు తీర్చిన వడ్డీరేటు --------

a) 20 % b) 5 % c) 10 % d) 15 %

13) ఒకరు 5 % వడ్డీరేటు చొప్పున 2 సంవత్సరముల తరువాత, 20 రు.లు వడ్డీచెల్లించిన అప్పుతీసికున్న సొమ్ము --------

a) 100 రు b) 150 రు c) 200 రు d) 250 రు

14) 400 రు.లు 5 % వడ్డీరేటు చొప్పున ఎన్ని సంవత్సరముల తరువాత 20 రు.లు వడ్డీ అగును.

a) $\frac{1}{2}$ సం b) 1 సం c) 2 సం d) $2\frac{1}{2}$ సం

15) 500 రు.లను 2 % వడ్డీరేటుతో ఎంత కాలమునకు అప్పుఇస్తే, 550 రు.లు మొత్తము అగును.

a) 3 సం  b) 2 సం  c) 5 సం  d) ఇవేవీకావు

16) 200 రు.ల సొమ్ముపై 4%రేటున 1 సంవత్సరమునకు వచ్చేవడ్డీ--------

a) 4 రు  b) 8 రు  c) 12 రు  d) 15 రు

17) కొంత సొమ్ముపై 4% వడ్డీరేటున 2 సంవత్సరములతో 20 రు.లు వడ్డీ వచ్చిన ఆ సొమ్ము --------

a) 200 రు  b) 300 రు  c) 250 రు  d) ఇవేవీకావు

18) 100 రు.లను 10 % చొప్పున అప్పిచ్చి, 200 రు.లు పొందవలెనన్న ఎంతకాలము ఆగవలెను.

a) 5 సం  b) 10 సం  c) 15 సం  d) 20 సం

19) వడ్డీపై కూడ వడ్డీపొందగల వడ్డీ --------

a) బారువడ్డీ  b) చక్రవడ్డీ

c) బారు, చక్రవడ్డీ d) ఇవేవీకావు

20) కొంతసొమ్మును 10 % రేటున 6నెలలకోసారి తిరగకట్టేట్లు, అప్పుతెచ్చి, సంవత్సరము చివర 441 రు.లతో అప్పుతీర్చివేసిన అప్పు తెచ్చిన సొమ్ము --------

a) 410 రు.  b) 420 రు.  c) 400 రు.  d) 430 రు.

21) 400 రు.లను సంవత్సరమునకు 2 సార్లు తిరగకట్టేట్లు, 10% వడ్డీరేటు చొప్పున అప్పు తెస్తే, సంవత్సరము చివర అతను బాకీ చెల్లించుట కివ్వవలసిన సొమ్ము --------

a) 430 రు  b) 441 రు  c) 410 రు  d) 420 రు

22) 400 రు.లను 6నెలలకోసారి వడ్డీ తిరగకట్టేట్లు 1 సంవత్సరమునకు అప్పుతెచ్చి 441 రు.లతో బాకీ చెల్లిస్తే వడ్డీరేటు.

a) 5 %  b) 10 %  c) 15 %  d) 20 %

23) 576 రు.లను 1 సంవత్సరములో రెండుసార్లు తిరగకట్టేట్లు తెచ్చి, 625రు.లతో 1 సంవత్సరము తరువాత బాకీరద్దు చేస్తే వడ్డీరేటు --------

a) $4\frac{1}{6}$ %     b) $8\frac{1}{3}$ %     c) 4 %     d) 8 %

24) 400 రు.లను 10 % బారువడ్డీకి 1 సంవత్సరమునకు అప్పుతెచ్చి దానిని అదేరేటుకు 2 సార్లు తిరగకట్టేట్లు వేరొకనికి అప్పు ఇస్తే అతనికి లాభము --------

a) 10 రు     b) 20 రు     c) 5 రు     d) 1 రు

25) 4000 రు.లను చక్రవడ్డీకి 2 సం.లకు అప్పిస్తే, 410 వడ్డీవస్తే వడ్డీరేటు -------- (ఇక్కడ సంవత్సరమునకు ఒకసారి తిరగకట్టబడింది)

a) 2 %     b) 3 %     c) 4 %     d) 5 %

26) 500 రు.లకు 5 % వడ్డీరేటున ఎన్ని సంవత్సరములకు బారువడ్డీకి అప్పిస్తే, సొమ్ము రెట్టింపగును

a) 10 సం     b) 15 సం     c) 20 సం     d) ఇవేవీకావు

27) ఏంతసొమ్ముపై సంవత్సరమునకు 10 % వడ్డీరేటు చొప్పున 3 సంవత్సరములకు అయ్యే బారువడ్డీ, 500 రు.లపై 12 % రేటున 2 సంవత్సరములకు చక్రవడ్డీతో సమానమగును.

a) 424 రు     b) 212 రు     c) 300 రు     d) 500 రు

28) ఎంతసొమ్ము 10 % బారువడ్డీ చొప్పున 6 సంవత్సరములలో 2000 రు.లు మొత్తముగా పొందవచ్చును.

a) 1200 రు     b) 1300 రు     c) 1250 రు     d) 1350 రు

29) 5000 రు.లను 3 సం.లకు ఏరేటున బారువడ్డీకిస్తే 6200రు. మొత్తమగును

a) 5 %     b) 8 %     c) 10 %     d) 15 %

30) కొంత సొమ్మును 5 % రేటున 5 సం.లకు బారువడ్డీకి అప్పుగా ఇస్తే 200 రు.లు వడ్డీ వచ్చినది. ఆ సొమ్ము -----

a) 600 రు     b) 800 రు     c) 700 రు     d) 500 రు

31) 2000 రు.లను 5 % రేటున 2 సంవత్సరములకు వరుసగా బారువడ్డీకి, చక్రవడ్డీకి అప్పుఇస్తే, వచ్చే వడ్డీ సొమ్ముల తేడా --------

a) 600 రు     b) 5 రు     c) 10 రు     d) 25 రు

32) 500 రు.లను ఏరేటున బారువడ్డీకి 2 సంవత్సరములకు అప్పిస్తే 50 రు.ల వడ్డీ వస్తుంది

a) 4 %  b) 5 %  c) 6 %  d) ఇవేవీకావు

33) ఎంతసొమ్మును 3 % రేటున బారువడ్డీకి అప్పిస్తే సంవత్సరములో 30 రు వడ్డీ వస్తుంది.

a) 1000 రు  b) 1500 రు  c) 1250 రు  d) 1600 రు

34) 500 రు.లను 3% రేటున ఎన్ని సంవత్సరములకు అప్పిస్తే 150 రు. వడ్డీ వస్తుంది.

a) 5 సం  b) 4 సం  c) 10 సం  d) 12 సం

35) 500 రు.లను 5 % వడ్డీరేటున ఎన్ని సంవత్సరములక అప్పిస్తే 1000 రు.లు మొత్తమగును.

a) 10 సం  b) 15 సం  c) 20 సం  d) 25 సం

36) ఎంతసొమ్మును 10 % రేటున 2 సంవత్సరములకు వరుసగా బారువడ్డీకి, చక్రవడ్డీకి అప్పిస్తే వడ్డీలతేడా 103 రు.లు అగును

a) 10300 రు  b) 10200 రు

c) 10000 రు  d) ఇవేవీకావు

## జవాబులు

1) a  2) b  3) b  4) c

5) a  6) b  7) a  8) b

9) b  10) b

11) a వడ్డీ = 1025 - 1000 = 25 రు. సూత్రము నుండి

$$\frac{100 \times 20}{100 \times 2} = 10\%$$

13) c  ఇందులో వడ్డీ = 20 రు.లు రేటు = 5%, కాలము = 2 సం.లు కావున సొమ్ము

$$= \frac{100 \times \text{వడ్డీ}}{\text{కాలము} \times \text{రేటు}} = \frac{100 \times 20}{2 \times 5} = 200 \text{ రు.లు}$$

14) b  అసలు = 400 రు, రేటు= 5 % కాలము

$$= \frac{100 \times \text{వడ్డీ}}{\text{అసలు} \times \text{రేటు}} = \frac{100 \times 20}{400 \times 5} = 1 \text{ సం}$$

15) c  కాలము = $\frac{100 \times \text{వడ్డీ}}{\text{అసలు} \times \text{రేటు}} = \frac{100 \times 50}{500 \times 2} =$ 5సం

ఇందులో వడ్డీ = 550 − 500 = 50 రు. అగును.

16) b  వడ్డీ = $\frac{200 \times 4 \times 1}{100} = 8$ రు

17) c  సొమ్ము = $\frac{100 \times \text{వడ్డీ}}{\text{కాలము} \times \text{రేటు}} = \frac{100 \times 20}{2 \times 4} = 250$ రు

18) b  వడ్డీ = 200 − 100 = 100 రు కాలము  బీ(100 × వడ్డీ,అసలు × రేటు) $= \frac{100 \times 100}{100 \times 10} = 10$ సం

19) b

20) c  $A = P\left(1 + \frac{r}{100}\right)^n$ నుండి $\left(1 + \frac{5}{100}\right)^2 P = 441$ రు.లు $P = \frac{441}{\left(1 + \frac{1}{20}\right)^2} = \frac{441}{\left(\frac{21}{20}\right)^2} = \frac{441}{441} \times 400 = 400$ రు

ఇందులో రేటు = $\frac{10}{2} = 5\%$ ఎందువల్లననగా సంవత్సరములో రెండుసార్లు తిరగకట్టు చున్నారు. కనుక $n = 2$ అగును.

21) b  ఇందులో P = 400 రు, రేటు = $\frac{10}{2} = 5\%$; $n = 2$ $A = 400\left(1 + \frac{5}{100}\right)^2 = 400 \times \frac{21}{20} \times \frac{21}{20} = 441$ రు.లు.

22) b  వడ్డీరేటు = $\left[\left(\frac{A^{\frac{1}{n}}}{P^n} - 1\right)\right] \times 100$

$= \left[\left(\frac{441}{400}\right)^{\frac{1}{2}} - 1\right] \times 100 = \left[\frac{21}{20} - 1\right] \times 100 = \frac{1}{20} \times 100$

= 5% ఇందులో రెండుసార్లు తిరగకట్టారు. కావున వడ్డీరేటు = 10 %

23) b  రేటు = $\left[\left(\frac{625}{576}\right)^{\frac{1}{2}} - 1\right] \times 100 = \left[\frac{25}{24} - 1\right] \times 100$

అనగా $\frac{1}{24} \times 100 = \frac{25}{6} = 4\frac{1}{6}\%$ సంవత్సరరేటు = $8\frac{1}{3}\%$

24) d బారువడ్డీ = $\frac{400 \times 10 \times 1}{100}$ = 40 రు, చక్రవడ్డీలో రేటు = 5% ; n = 2 కనుక A = 400 $\left(1 + \frac{5}{100}\right)^2$ = 441 రు. అనగా వడ్డీల తేడా = 41 - 40 = 1రు.

25) d మొత్తము 4000 + 410 = 4410రు. రేటు $\left[\left(\frac{A}{P}\right)^{\frac{1}{n}} - 1\right]$ × 100

$$= \left[\left(\frac{4410}{4000}\right)^{\frac{1}{2}} - 1\right] \times 100 = \left[\frac{21}{20} - 1\right] \times 100 = \frac{1}{20} \times 100 = 5\%$$

ఇక్కడ సంవత్సరమునకొకసారి తిరగకట్టబడుతున్నది. కావున r = 5% అగును.

26) c రెట్టింపు కావలెనన్న వడ్డీ కూడ 500 రు.లు కావలెను. కావున 500 = $\frac{500 \times T \times 5}{100}$ ⇒ T = 20 సం

27) 500 రు.లపై చక్రవడ్డీ మొత్తము (A) = 500 $\left(1 + \frac{12}{100}\right)^2 = 500\left(1 + \frac{3}{25}\right)^2 = 500\left(\frac{28}{25}\right)^2 = 500 \times \frac{28}{25} \times \frac{28}{25}$ = రు 627.20 నపై. కావున చక్రవడ్డీ = 627.20−500 = 127.20 నపై. బారువడ్డీ కూడ 127.20 నపై అయిన 127.20 = $\frac{P \times 3 \times 10}{100}$ అని ఇవ్వబడింది. కావున P = $\frac{1272}{3}$ = 424 రు

28) c మొత్తము = (అసలు సొమ్ము + వడ్డీ) కావున P + I = 2000 రు P + I = \f(P × 10 × 6,100) ⇒ (2000 - P) = $\frac{P \times 1 \times 3}{5}$ ⇒ 10000 - 5P = 3P ⇒ 8P = 10000 కనుక = P = $\frac{10000}{8}$ = 1250

29) b వడ్డీ = 6200 - 5000 = 1200రు., కాలము = 3 సం. రేటు = $\frac{100 \times \text{వడ్డీ}}{\text{అసలు} \times \text{కాలము}} = \frac{100 \times 1200}{5000 \times 3} = \frac{400 \times 1}{50} = 8\%$

30) b సొమ్ము = P, రేటు = 5%, కాలము = 5 సం. వడ్డీ = 200 రు.లు సొమ్ము $= \frac{100 \times 200}{5 \times 5} = 800$ రు.

31) b బారువడ్డీ $= \frac{2000 \times 5 \times 2}{100} = 200$ రు, చక్రవడ్డీలో మొత్తము $A = 2000\left(1 + \frac{5}{100}\right)^2 = 2000 \times \frac{21}{20} \times \frac{21}{20} = 2205$ రు, చక్రవడ్డీ = 2205 - 2000 = 205 రు. కావున తేడా = 205 - 200 = 5 రు.

32) b $I = \frac{PTR}{100} \Rightarrow R = \frac{100\,I}{PT} = \frac{100 \times 50}{500 \times 2} = 5\%$

33) a $P = \frac{100\,I}{R \times T}$ నుంచి సొమ్ము $= \frac{100 \times 30}{3 \times 1} = 1000$ రు.

34) c $T = \frac{100\,I}{R \times P}$ నుంచి $\frac{100 \times 150}{3 \times 500} = 10$ సం.

35) c వడ్డీ = (మొత్తము - అసలు) అను సూత్రము నుండి వడ్డీ = 1000 - 500 = 500 రు, రేటు = 5 % ; అసలు = 500 రు కాలము $= \frac{100\,I}{P \times r} = \frac{100 \times 500}{500 \times 5} = 20$ సం

36) a $r = 10\%$; $T = 2$ సం.లు బారువడ్డీ $= \frac{P \times 10 \times 2}{100}$ $\therefore I = \frac{P}{5}$; చక్రవడ్డీలో మొత్తము $(A) = P\left(1 + \frac{r}{100}\right)^n$ నుంచి $A = P\left(1 + \frac{10}{100}\right)^2 = P\left(\frac{11}{10}\right)^2 = \frac{121P}{100}$ కావున చక్రవడ్డీ $= \frac{121P}{100} - P = \frac{121P - 100P}{100} = \frac{21P}{100}$, కాని చక్రవడ్డీ, బారువడ్డీలతేడా = 103రు. కావాలి, కనుక $\frac{21P}{100} - \frac{P}{5} = 103$ రు. $\frac{21P - 20P}{100} = 103 \Rightarrow \frac{P}{100} = 103 \Rightarrow P = 10300$రు. కనుక ఆ సొమ్ము = 10300 రు.

## సరాసరి (సగటు)

1) కొన్ని రాసుల మొత్తము, వాటి సంఖ్య తెలిసిన వాని సగటు

a) $\frac{\text{ఆరాసుల మొత్తము}}{\text{వానిసంఖ్య}}$ b) రాసులమొత్తము × వాటిసంఖ్య

c) $\frac{\text{రాసుల సంఖ్య}}{\text{రాసులమొత్తము}}$ d) ఇవేవీకావు.

2) రాసులసంఖ్య, వాటి సరాసరి తెలిసిన, వాటి మొత్తము ----

a) $\frac{\text{రాసులసంఖ్య}}{\text{వాటిసరాసరి}}$ b) రాసులసంఖ్య ×వాటి సరాసరి

c) $\frac{\text{సరాసరి}}{\text{ఆరాసులసంఖ్య}}$ d) ఇవేవీకావు

3) కొన్ని రాసుల మొత్తము, వాటి పరాసరి తెలిసిన రాసుల సంఖ్య -------

a) రాసుల మొత్తము × వాటి సరాసరి

b) $\frac{\text{రాసులమొత్తము}}{\text{వాటిసరాసరి}}$

c) $\frac{\text{రాసులమొత్తము} \times \text{రాసులసరాసరి}}{2}$

d) ఇవేవీకావు

4) ఒకరోజువారీ కూలీ ఒక వారములో 350రు.లు సంపాదిస్తే, అతని సగటు కూలి.

a) 50 b) 40 రు c) 60 రు d) 55 రు

5) ఒకడు ఒక వారములో మొదటి 5రోజులలో 300రు.లను, మిగతా రెండు రోజులలో 50 రు.లు మొత్తము సంపాదిస్తే, అతని రోజువారీసంపాదన

a) 60 రు b) 50 రు c) 55 రు d) 40 రు

6) 10 మంది మార్కుల సరాసరి 70. అయిన వారి మొత్తము మార్కులు -------

a) 700 b) 7 c) 70 d) ఇవేవీకావు

7) కొందరి మొత్తము మార్కులు 600 లు. వారిసరాసరి మార్కులు 50. అయిన వారి సంఖ్య -------

a) 15 b) 12 c) 11 d) 13

8) ఒకడు మొదటి ఐదురోజుల సరాసరి 30రు.లు సంపాదించెను. చివరి రెండు రోజుల మొత్తం 70 రు.లు సంపాదిస్తే, ఆ వారపు మొత్తము సంపాదన

a) 220 రు b) 210 రు c) 230 రు d) 150 రు

9) ఒకడు మొదటి ఆరు రోజులలో 50 రు.లు సరాసరి సంపాదించెను. 7వరోజు ఎంత సంపాదిస్తే ఆ వారపు సరాసరి 60 రు.లు అగును

a) 100 రు b) 120 రు c) 110 రు d) 90 రు

10) ఒకడు మొదటి ఆరు రోజులలో 500 రు.లు సంపాదించెను. అతను ఆ వారపు సరాసరి 80 రు. చేయదల్చిన, అతను చివరిరోజు ఎంత సంపాదించాలి.

a) 90 రు b) 50 రు c) 60 రు d) 55 రు

11) ఒకడు మొదటి 2 రోజులలో రోజుకు 100రు.ల చొప్పున మిగతా 3 రోజులలో 150 రు. ల మొత్తము సొమ్ము సంపాదిస్తే, అతని సరాసరి సంపాదన --------

a) 75 రు b) 70 రు c) 60 రు d) 65 రు

12) 1988వ సంవత్సరము ఫిబ్రవరినెలలో ఒకడు 1450 రు.లు సంపాదిస్తే, అతని రోజు వారి కూలి --------

A) 45 రు b) 51 రు. 79 పైసె

c) 50 రు d) 40 రు

13) ఇద్దరు బాలుర బరువు వరుసగా 40 కిలోలు, 30 కిలోలు. మిగతా 10 మంది సరాసరి బరువు 45 కిలోలు. అయిన 12 మంది మొత్తము బరువు --------

a) 500 కిలోలు b) 510 కిలోలు

c) 520 కిలోలు d) 450 కిలోలు

14) 10 మంది బాలురు సరాసరి బరువు 50 కిలోలు. వారి సరాసరి బరువు 1 కిలోగ్రామ్ పెరగాలంటే ఎంత సరాసరి బరువుగల ఇద్దరు బాలురను చేర్చుకోవాలి?

a) 54 కిలోలు b) 55 కిలోలు c) 56 కిలోలు

15) అయిదుమంది బాలుర సరాసరి వయస్సు 8 సం.లు మరో ముగ్గురు బాలుర మొత్తము వయస్సు 32 సం.లు. 8 మంది బాలుర సరాసరి వయస్సు -------

a) 6 సం.లు    b) 10 సం.లు

c) 7 సం.లు    d) 9 కిలోలు

16) ముగ్గురి సరాసరి వయస్సు 18 సం.లు. మూడవ వాని వయస్సు 14 సం.లు అయిన మిగతా వారి సరాసరి.

a) 11 సం.లు    b) 22 సం.లు

c) 20 సం.లు    d) 9 సం.లు

17) అయిదు మంది సరాసరి మార్కులు 50. వారి సరాసరి మార్కులు ఇద్దరు క్రొత్తగా చేరినందున 48 అయినది. అయిన క్రొత్తగా చేరిన వారి మొత్తము మార్కులు.

a) 96    b) 86    c) 76    d) 95

18) 4 గురి సరాసరి మార్కులు 60. వారి సరాసరి 62 కావాలంటే ఏ సరాసరి మార్కుగల ఇద్దర్ని చేర్చుకోవాలి.

a) 64    b) 66    c) 65    d) 62

19) ముగ్గురి సరాసరి బరువు, 50 కిలోలు. మరోముగ్గురు చేరడంవల్ల వారి సరాసరి 55 కిలోలు అయినది. క్రొత్తగా చేరిన వారి సరాసరి బరువు.

a) 58 కిలోలు    b) 59 కిలోలు

c) 60 కిలోలు    d) 56 కిలోలు

20) 10 మంది యొక్క రోజూ సరాసరి ఖర్చు 60 రు. అయిన వారి మొత్తము ఖర్చు -------

a) 600 రు    b) 500 రు    c) 450 రు    d) 400 రు.

21) 5గురి సరాసరి మార్కులు 50. మొదటి నలుగురి మొత్తము మార్కులు 196 అయిన చివర వాని మార్కులు

a) 55    b) 54    c) 53    d) 56

22) నలుగురి సరాసరి మార్కులు 80. చివరి ఇద్దరి మొత్తము 180 మొదటి ఇద్దరి సరాసరి మార్కులు -------

a) 75    b) 74    c) 70    d) 72

23) 10 మంది మొత్తము బరువు 500 కిలోలు. వారి సరాసరి బరువు.

a) 50 కిలోలు b) 55 కిలోలు c) 53 కిలోలు d) 51 కిలోలు

24) అయిదు మంది కుటుంబ సభ్యులు గల కుటుంబము రోజు ఖర్చు 30 రు. ఇద్దరు వేరేవూరు వెళ్ళినందున మిగతా వారి రోజు ఖర్చు (అందరూ సమానముగా ఖర్చుచేస్తే).

a) 20 రు  b) 19 రు  c) 18 రు  d) 22 రు

25) 31 మంది మొత్తము ఖర్చు రు. 2060 అందు 14 మంది సరాసరి ఖర్చు 50 రు. అయిన మిగతా వారి సరాసరి.

a) 60 రు  b) 80 రు  c) 70 రు  d) 55 రు

26) అయిదు మంది సరాసరి బరువు 40 కిలోలు. అందు ముగ్గురి మొత్తము బరువు 135 కిలోలు. మిగతా ఇద్దరి మొత్తము బరువు.

a) 55 కిలోలు b) 60 కిలోలు c) 65 కిలోలు d) 70 కిలోలు

27) ఒకడు నాలుగు గంటలు ప్రయాణము చేసెను. మొదటి రెండు గంటలు 6కి.మీ వేగంతోను మిగిలిన కాలము 4 కి.మీ వేగంతోను పోతే సరాసరి వేగము -------

a) 5 కి.మీ/గం  b) 8 కి.మీ/గం

c) 2.5కి.మీ/గం  d) 6 కి.మీ/గం

28) ఒక బస్సు 3 గంటల సేపు 8 కి.మీ. వేగంతో పోయి గమ్యముచేరి తిరుగు ప్రయాణంచేసి 2 గంటలలో గమ్యం చేరిన, వచ్చేటప్పటి సరాసరి వేగము -------

a) 5 కి.మీ/గం  b) 12 కిమీ/గం

c) 10 కి.మీ/గం  d) కనుగొనలేము

## జవాబులు

1) a  2) b  3) b  4) a $\frac{350}{7} = 50$ రు

5) b 7 రోజుల మొత్తము సంపాదన = 300 + 50 = 350

రు. లు రోజువారీ సరాసరి సంపాదన = $\frac{350}{7} = 50$ రు

6) a మొత్తము మార్కులు = $70 \times 10 = 700$

7) b $\frac{\text{మొత్తము మార్కులు}}{\text{సరాసరి}}$ = వారి సంఖ్య $\Rightarrow \frac{600}{50} = 12$ మంది

8) a మొదటి అయిదురోజుల మొత్తం సంపాదన = 150 రు.లు చివరి రెండు రోజుల మొత్తం సంపాదన = 70 రు.లు కావున ఆవారపు మొత్తము సంపాదన = 150 + 70 = 220 రు.లు

9) b మొదటి ఆరు రోజుల మొత్తము సంపాదన = $6 \times 50$ = 300. కాని ఆ వారపు సరాసరి 60 రు.లు కావలెనన్న మొత్తము సంపాదన $7 \times 60 = 420$ రు. కావలెను. కావున ఏడవ రోజు సంపాదన 420 - 300 = 120 రు.లు అగును

10) c వారపు మొత్తము సంపాదన = $80 \times 7 = 560$ రు.లు. అయితే ఆరు రోజులలో 500రు.ల సంపాదించాడు. కావున చివరి రోజు 560 - 500 = 60 రు.లు సంపాదించాలి.

11) b రెండు రోజుల మొత్తము సంపాదన $2 \times 100 = 200$ రు. 5 రోజుల మొత్తము సంపాదన = 200 + 150 = 350 రు.లు

సరాసరి సంపాదన = $\frac{350}{5} = 70$ రు.

12) 1988 వ సంవత్సరము లీపుసంవత్సరము. కనుక ఫిబ్రవరి నెలకు 29రోజులుంటాయి. మొత్తము సంపాదన 1450 రు.లు

కావున రోజుకూలి (సరాసరి) = $\frac{1450}{29} = 50$ రు.

13) c మొదటి ఇద్దరి బాలుర మొత్తము బరువు = 70 కిలోలు. 10 మంది మొత్తము బరువు = $10 \times 45 = 450$ కిలోలు. కావున 12 మంది మొత్తము బరువు = 70 + 450 = 520 కిలోలు.

14) c 10 మంది మొత్తం బరువు = $10 \times 50 = 500$ కిలోలు. ఇద్దర్ని చేర్చుకుంటే 12 మంది అవుతారు. 1 కిలోగ్రామ్ బరువు పెరిగిన సరాసరి బరువు 51కిలోలగును. 12 మంది మొత్తము బరువు $12 \times 51 = 612$ కిలోలు కావాలి. కనుక ఇద్దరి మొత్తము

బరువు 612 - 500 = 112 కిలోలు అనగా వారి సరాసరి = $\frac{112}{2}$
56 కిలోలు

15) d అయిదు మంది మొత్తము వయస్సు = 5 × 8 = 40 సం.లు ముగ్గురి మొత్తము వయస్సు 32 సం.లు. కనుక 8 మంది మొత్తము వయస్సు = 72 సం.లు. కనుక వారి సరాసరి వయస్సు= $\frac{72}{8}$=9 సం.లు

16) c ముగ్గురి మొత్తము వయస్సు = 18 × 3 = 54 సం.లు మూడవ వారి వయస్సు 14 సం.లు. కావున మిగతా ఇద్దరి మొత్తము వయస్సు = 54 - 14 = 40సం.లు వారి సరాసరి = $\frac{40}{2}$ = 20 సం.లు

17) b అయిదు మంది మొత్తము మార్కులు = 5 × 50 = 250 ఇద్దరు చేరిన 7మంది మొత్తము మార్కులు = 7 × 48 = 336. ఇద్దరి మొత్తము మార్కులు = 336 - 250 = 86.

18) b నలుగురి మొత్తము మార్కులు = 4 × 60 = 240. ఇద్దరు చేరి, 6మంది చేరిన మొత్తము మార్కులు = 6 × 62 = 372 ఇద్దరి మొత్తము మార్కులు = 372 - 240 = 132 కావున వారి సరాసరి = $\frac{132}{2}$ = 66.

19) c ముగ్గురి మొత్తము బరువు = 3 ౫ 50 = 150 కి.లోలు. 6 మంది మొత్తము బరువు = 6 × 55 = 330 కిలోలు. క్రొత్తగా చేరిన ముగ్గురి మొత్తము బరువు = 330 - 150 = 180. వారి సరాసరి బరువు = $\frac{180}{3}$ = 60 కిలోలు.

20) a

21) b 5 మంది మొత్తము మార్కులు = 250. చివర వాని మార్కులు = 250 - 196 = 54

22) నలుగురి మొత్తము మార్కులు = 320, మొదటి ఇద్దరి మొత్తము మార్కులు = 320 - 180 = 140. వారి సరాసరి $= \frac{140}{2} = 70$

23) a సరాసరి బరువు $= \frac{500}{10} = 50$ కిలోలు

24) c అయిదుమంది మొత్తంఖర్చు = 30 రు. కనుక ఒక్కొక్కరి సరాసరి ఖర్చు = 6 రు. ఇద్దరు వేరేవూరు వెళ్ళినందున మిగిలిన ముగ్గురి ఖర్చు = 3 × 6 = 18 రు.

25) b 31 మంది మొత్తము ఖర్చు = 2060రు. ఇందులో 14 మంది మొత్తము ఖర్చు = 14 × 50 = 700 రు. కనుక మిగిలిన వారి మొత్తము ఖర్చు = 2060 - 700 = 1360 రు.లు 17 మంది సరాసరి ఖర్చు $= \frac{1360}{17} = 80$ రు.లు

26) c అయిదుమంది మొత్తము బరువ = 5 × 40 = 200 కిలోలు. ముగ్గురి మొత్తము బరువు 135 కిలోలు. కనుక మిగిలిన ఇద్దరి మొత్తము బరువు = 200 - 135 = 65 కిలోలు

27) a మొదటి రెండు గంటలలో మొత్తము వేగము = 6 × 2 = 12 కి. మిగిలిన 2 గంటలలో మొత్తము వేగము = 4 × 2 = 8 కి.మీ. 4 గంటలలో సరాసరి వేగము $= \frac{12+8}{4} = 5$ కి.మీ/గం.

28) b బస్సు పోయిన దూరము = 3 × 8 = 24 కి.మీ. తిరుగు ప్రయాణములో 2 గంటలలో వచ్చినది కనుక సరాసరి వేగము $= \frac{24}{2} = 12$ కి.మ/గం.

## సంఖ్యామానము

1) మనము వాడుకలో వాడే దశాంశ మానములో ———మండి ——— వరకు అంకెలు ఉంటాయి

a) 0, 9, b) 0, 8 c) 0, 1 d) ఇవేవీకావు

2) ద్విసంఖ్యామానములో వాడే అంకెలు

a) 1 b) 1, 2 c) 0, 2 d) ఇవేవీకావు

3) త్రిసంఖ్యామానములో వాడే అంకెలు

a) 0, 1, 3 b) 1, 2, 3 c) 0, 1, 2 d) 2, 3, 4

4) సప్తాంశమానములో వాడే అంకెలు

a) 0, 1, 2, 3, 4, 5, 6 b) 0, 1, 2, 3, 4, 5, 6, 7

c) 0, 1, 2, 3 d) ఇవేవీకావు

5) ద్విసంఖ్యా మానములో బేస్ ------ ఉండును.

a) 2 b) 1 c) 10 d) 3

6) త్రిసంఖ్యా మానములో బేస్ ------ గా ఉంటుంది.

a) 1 b) 2 c) 3 d) 10

7) సప్తాంశమానములో బేస్ ------ గా ఉంటుంది.

a) 5 b) 6 c) 7 d) 1

8) ద్వాదశాంశమానములో బేస్ ------ గా ఉంటుంది.

. a) 10 b) 12 c) 7 d) 8

9) ద్వాదశాంశమానములో వాడే అంకెలు ------

a) 0, 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 12

b) 0, 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, y, z

c) 0 నుండి 10 వరకు

d) ఇవేవీకావు

10) $10111_2$ ------ సంఖ్యామానములో ఉన్నది.

a) ద్వి b) త్రి c) సప్తాంశ d) ద్వాదశాంశ

11) $23_{10}$ ------ మానములో ఉన్నది

a) ద్వి b) త్రి c) దశాంశ d) ద్వాదశాంశ

12) సప్తాంశమానములోని సంఖ్యను దశాంశమానములోనికి మార్చేటప్పుడు, కుడి వైపు నుండి ఎడమవైపుకు గల అంకెలను వరుసగా ------ లచే గుణించి కలపవలెను.

a) 1, 7, $7^2$, $7^3$ ------ b) 1, 2, $2^2$, $2^3$ ------

c) 1, 3, $3^2$, $3^3$ ------ d) 1, 12, $12^2$, $12^3$ -----

13) ద్విసంఖ్యామానములోని సంఖ్యను దశాంశమానములోనికి మార్చేటప్పుడు కుడివైపునుండి ఎడమవైపుకు గల అంకెలను వరుసగా ------ లచే గుణించి కలపవలెను

a) 1, 2, $2^2$, $2^3$, ------ b) 1, 3, $3^2$, $3^3$, ------

c) 1, 7, $7^2$ ------ d) ఇవేవీకావు

14) త్రిసంఖ్యామానములోని సంఖ్యను దశాంశమానములోనికి మార్చేటప్పుడు కుడివైపునుండి, ఎడమవైపుకు గల లంకెలను వరుసగా ------ చే గుణించి కలపవలెను.

a) 1, 2, $2^2$ ------ b) 1, 3, $3^2$ ------

c) 1, 7, $7^2$ ------ d) ఇవేవీకావు

15) $415_2$ ను దశాంశమానములోనికి మార్చిన

a) $23_{10}$ b) $24_{10}$ c) $25_{10}$ d) $26_{10}$

16) $41_2 + 21_2$ విలువ

a) $60_2$ b) $71_2$ c) $70_2$ d) ఇవేవీకావు

17) $124_{12}$ ను దశాంశమానంలోకి మార్చిన ------

a) $171_{10}$ b) $172_{10}$ c) $175_{10}$ d) $178_{10}$

## జవాబులు

1) a 2) a 3) c 4) a 5) a

6) c 7) c 8) b 9) b 10) a

11) c 12) a 13) a 14) b

15) a ఎందువల్లననగా $5 \times 1 + 1 \times 2 + 2^2 \times 4 = 5 + 2 + 16 = 23_{10}$

16) c ఇందులో 1 + 1 = 10 కనుక జవాబు $70_2$ అగును

17) b ఇందులో $4 \times 1 + 2 \times 12 + 1 \times 12^2 = 4 + 24 + 144 = 172_{10}$

# స్టాకులు - షేర్లు

1) 'స్టాకు' అనగా
   a) ఎల్లప్పుడు 100రు.లని అర్థము
   b) కంపెనీ మూలధనము నిర్ధేశించినప్పుడు 100రు లని అర్థము
   c) ఒకని వద్ద ఉన్న నిల్వ అని అర్థము
   d) ఇవేవీకావు
2) 'స్టాకు' ఎల్లప్పుడు
   a) కొనబడును లేదా అమ్మబడుతుంది
   b) పెట్టుబడి లేదా పొందబడేది
   c) 100 రు. గా ఉంటుంది
   d) ఇవేవీకావు
3) 'బ్రోకరేజి' అనగా
   a) స్టాకుమీద వచ్చే వడ్డీ
   b) స్టాకు డీలర్‌కు స్టాకు కొన్నప్పుడు చెల్లించే కమీషన్
   c) ఒకనివద్దనుంచి మరొకరికి స్టాకు అమ్ముట
   d) ఇవేవీకావు
4) స్టాకు కొన్నప్పుడు బ్రోకరేజిని ------
   a) మార్కెట్ విలువకి కలపవలెను
   b) మార్కెట్ విలువనుండి తీసివేయాలి
   c) లెక్కలోనికి తీసికోరాదు
   d) ఇవేవీకావు
5) స్టాకు అమ్మేటప్పుడు బ్రోకరేజిని ------
   a) మార్కెట్ విలువకి కలపవలెను
   b) మార్కెట్ విలువనుండి తీసివేయవలెను
   c) లెక్కలోనికి తీసికొనరాదు
   d) ఇవేవీకావు
6) "స్టాక్ ఎట్‌పార్" అనగా ------
   a) 100 రు.ల విలువగల స్టాకును 100రు.లకే అమ్ముట

b) 100 రు.ల స్టాక్ అమ్మకం విలువ 100రు.లకంటే తక్కువకు అమ్మట

c) 100 రు.ల స్టాకు అమ్మకం విలువ 100 రు.ల కంటే ఎక్కువకుఅమ్మట

d) ఇవేవీకావు

7) "స్టాక్ ఎబౌ పార్" లేక "ప్రీమియం" అనగా ------

a) 100 రు.ల స్టాకు అమ్మకం విలువ 100 రు.లకంటే తక్కువ కావడం

b) 100 రు.ల స్టాకు అమ్మకం విలువ 100 రు.ల కంటే ఎక్కువ రేటుకు అమ్మడం

c) అదేధరకు అమ్మట

d) ఇవేవీకావు

8) 'స్టాక్ బిలో పార్' అనగా ------

a) 100 రు.ల స్టాకు అమ్మకం విలువ 100 రు.ల కంటే తక్కువ

b) 100 రు.ల స్టాకు అమ్మకం .విలువ 100 రు.ల కంటే ఎక్కువ కావడం

c) అధేధరకు అమ్మట

d) ఇవేవీకావు

9) మార్కెటు విలువ, పెట్టుబడి తెలిసిన స్టాకు కనుగొనుటకు సూత్రము

a) $\frac{\text{మార్కెటువిలువ}}{\text{పెట్టుబడి}} \times 100$

b) $\frac{\text{పెట్టుబడి}}{\text{మార్కెట్విలువ}} \times 100$

c) $\frac{100}{\text{పెట్టుబడి} \times \text{మార్కెట్విలువ}}$

d) $\frac{\text{పెట్టుబడి}}{100} \times \text{మార్కెట్ విలువ}$

10) స్టాకు, మార్కెట్ విలువ తెలిసిన పెట్టుబడి ------

a) $\frac{\text{స్టాకు}}{100}$ × మార్కెట్ విలువ b) $\frac{\text{మార్కెట్విలువ}}{\text{స్టాకు}}$ × 100

c) $\frac{\text{స్టాకు}}{100}$ d) ఇవేవీకావు

11) రేటు, స్టాకు తెలిసిన రాబడి (Income) ------

a) $\frac{\text{రేటు}}{\text{స్టాకు}}$ × 100 b) $\frac{\text{రేటు}}{100}$ × స్టాకు

c) $\frac{\text{రేటు} \times \text{స్టాకు}}{100}$ d) ఇవేవీకావు

12) మార్కెట్ విలువ,పెట్టుబడి, రేటు తెలిసిన రాబడి (Income) ----

a) $\frac{\text{మార్కెట్విలువ} \times \text{రేటు}}{\text{పెట్టుబడి}}$ b) $\frac{\text{పెట్టుబడి} \times \text{రేటు}}{\text{మార్కెట్విలువ}}$

c) $\frac{\text{పెట్టుబడి}}{\text{మార్కెట్విలువ} \times \text{రేటు}}$ d) ఇవేవీకావు

13) 11000రు.ల పెట్టుబడితో 10%స్టాకు, 10 రు. ఎక్కువకి (above par) ఎంతస్టాకు కొనవచ్చును.

a) 1000 రు b) 10000 రు

c) 11000 రు d) 9000 రు

14) 9000 రు.ల పెట్టుబడిలో 10%స్టాకు 10రు తక్కువకి (belowpar) ఎంతకొనవచ్చును.

a) 9500 రు b) 9000 రు c)10,000 రు d) ఇవేవీకావు

15) 5 % స్టాకు 85లకు (5% stock at 85) లేక 3 % స్టాకు 90 లకు పెట్టుబడి పెడితే ఏది లాభము.

a) 3 % స్టాకు 90లకు b) 5 % స్టాకు 85 లకు

c) ఇవేవీకావు

16) 3800రు.ల పెట్టుబడితో 95 చొప్పున (at 95) ఎంతస్టాకు కొనవచ్చును.

a) 4000 రు b) 2850 రు c) 2800 రు d) 3900 రు

17) 102 $\frac{1}{4}$ గా ($\frac{1}{4}$ బ్రోకరేజితో) 1020రు.పొందుటకు ఎంతస్టాకు అమ్మవలెను.

a) 1050 రు b) 1000 రు c) 1100 రు d) ఇవేవీకావు

18) 200 రు,లు సంవత్సర ఆదాయం పొందడానికి 4% , 104 చొప్పున ఎంతస్టాకు కొనవలెను.

a) 4000 రు b) 5000 రు c) 6000 రు d) 4500 రు

19) 3000 రు.ల స్టాకు విలువ 95 గా (at 95) ------

a) 2850 రు b) $\frac{60000}{19}$ రు c) 2900 d) ఇవేవీకావు

20) 1000రు.ల 5 % స్టాకుమీద ఎంత సొమ్ము వస్తుంది?

a) 20 రు b) 30 రు c) 40 రు d) 50 రు

## జవాబులు

1) b 2) a 3) b 4) a 5) b 6) a

7) b 8) a 9) b 10) a 11) c 12) b

13) b స్టాకు = $\frac{11000}{110} \times 100 = 100000$ రు.

14) c స్టాకు = $\frac{9000 \times 100}{90} = 10000$ రు

15) b $\frac{85}{5} = 17$ రు. పెట్టుబడి పెడితే 1 రు. ఆదాయం వస్తుంది. ఇలాగే $\frac{90}{3} = 30$ రు. పెట్టుబడి పెడితే 1 రు. ఆదాయం వస్తుంది. కనుక 'B' లాభసాటి వ్యాపారము

16) a స్టాకు = $\frac{3800}{95} \times 100 = 4000$ రు

17) b అమ్మవలసిన స్టాకు = $\frac{1020 \times 100}{102} = 1000$ రు.

ఇందులో బ్రోకరేజి తగ్గించవలెను. కనుక $100\frac{1}{4} - \frac{1}{4} = 102$ గా వ్రాయాలి.

18) b కొనవలసిన స్టాకు $= \frac{\text{ఆదాయము} \times 100}{\text{రేటు}}$

$= \frac{200 \times 100}{4} = 5000$ రు

19) a పెట్టుబడి విలువ $= \frac{\text{స్టాకువిలువ} \times \text{రేటు}}{100} = \frac{3000 \times 95}{100}$

$= 2850$ రు

20) d వచ్చుసొమ్ము $= \frac{\text{స్టాకువిలువ} \times \text{రేటు}}{100} = \frac{1000 \times 5}{100}$

## స్థూపము – శంఖువు – గోళము

1) స్థూపము ఘనపరిమాణమునకు సూత్రము (∴ 'r' వ్యాసార్థము , h ఎత్తు

a) $\pi r^2 h$ b) $\frac{1}{3}\pi r^2 h$ c) $\frac{4}{3}\pi r^3$ d) $4\pi r^2$

2) స్థూపము యొక్క ప్రక్కతలవైశాల్యము ('r' వ్యాసార్థము, 'h' ఎత్తు) ------

a) $\pi r^2 h$ b) $2\pi r h$ c) $\frac{4}{3}\pi r^3$ d) $4\pi r^2$

3) స్థూపము 'r' వ్యాసార్థము, 'h' ఎత్తు కల్గియున్నది. దాని భూపరిధి -------

a) $2\pi r$ b) $\pi r^2 h$ c) $4\pi r^2$ d) ఇవేవీకావు

4) ఒక స్థూపము 'r' వ్యాసార్థము, 'h' ఎత్తు కలిగియున్నది. దాని సంపూర్ణతల వైశాల్యము -------

a) $2\pi r h$ b) $2\pi r(r+h)$ c) $2\pi r$ d) ఇవేవీకావు

5) శంఖువు 'r' వ్యాసార్థము 'h' ఎత్తు కలిగి యున్నది. దాని ఘనపరిమాణము.

a) $\pi r^2 h$ b) $\frac{1}{3}\pi r^2 h$ c) $2\pi r h$ d) ఇవేవీకావు

6) ఒకశంఖువు 'r' వ్యాసార్థము 'h' ఎత్తు కల్గియున్నది. దాని ప్రక్కతల వైశాల్యం. 'l' ఏటవాలు ఎత్తు)

a) $2\pi r h$ b) $\pi r h$ c) $\pi r l$ d) $\pi r (r + l)$

7) ఒకశంఖువు 'r' వ్యాసార్థము 'h' ఎత్తు కల్గియున్నది దాని ఏటవాలు ఎత్తు 'l' అయిన దాని సంపూర్ణతల వైశాల్యము ------

a) $\pi r (r + l)$ b) $2\pi r(r + l)$
c) $2\pi r(r + h)$ d) ఇవేవీకావు

8) శంఖువు ఏటవాలు ఎత్తు 'l' వ్యాసార్థము 'r' ఎత్తు 'h' అయిన ఏటవాలు ఎత్తు (l) విలువ ------

a) $r^2 + h^2$ b) $\sqrt{r^2 + h^2}$ c) $\sqrt{r^2 - h^2}$ d) ఇవేవీకావు

9) శంఖువు భూవ్యాసార్థము 'r' ఎత్తు 'h' అయిన దాని భూపరిధి.

a) $\pi r^2$ b) $2\pi r$ c) $4\pi r$ d) ఇవేవీకావు

10) 'r' వ్యాసార్థము, ఎత్తుగల శంఖువు భూవైశాల్యము ------

a) $2\pi r$ b) $\pi r^2$ c) $2\pi r^2$ d) ఇవేవీకావు

11) ఒక గోళము 'r' వ్యాసార్థము కలిగియున్నది. దీని ఘనపరిమాణము ------

a) $4\pi r^2$ b) $\frac{4}{3}\pi r^3$ c) $\frac{1}{3}\pi r^2 h$ d) ఇవేవీకావు

12) 'r' వ్యాసార్థము గల గోళ ఉపరితల వైశాల్యము ------

a) $\frac{4}{3}\pi r^3$ b) $4\pi r^2$ c) $2\pi r^2$ d) ఇవేవీకావు

13) గోళము ఒక ------

a) 3 - D పిక్చరు b) 2 - D పిక్చరు c) ఇవేవీకావు

14) అర్ధగోళము యొక్క ఘనపరిమాణము ------

a) $\frac{2}{3}\pi r^3$ b) $\pi r^3$ c) $3\pi r^2$ d) $2\pi r^2$

15) అర్ధగోళము యొక్క ఉపరితల వైశాల్యము ------

a) $2\pi r^2$ b) $3\pi r^2$ c) $4\pi r^2$ d) $\frac{4}{3}\pi r^2$

16) ఒకేవ్యాసార్థము, ఎత్తులు గల స్థూపము, శంఖువుల ఘనపరిమాణముల నిష్పత్తి ------
a) 3 : 1 b) 1 : 3 c) 1 : 2 d) 2 : 1

17) 4 సెం.మీ ఎత్తు, $\sqrt{7}$ సెం.మీ వ్యాసార్థముగల స్థూపము ఘనపరిమాణము ------
a) 44 ఘ.సెం.మీ b) 88 ఘ.సెం.మీ
c) 88 చ.సెం.మీ d) 44 చ.సెం.మీ

18) 14 సెం.మీ వ్యాసము గల స్థూపము భూ పరిధి ------
a) 44 సెం.మీ b) 88 సెం.మీ
c) 22 సెం.మీ d) ఇవేవీకావు

19) 14 సెం. మీ వ్యాసము, 3సెం.మీ ఎత్తుగల స్థూపముయొక్క సంపూర్ణతల వైశాల్యము ------
a) 44 చ.సెం.మీ b) 440 చ.సెం.మీ
c) 880 చ.సెం.మీ d) ఇవేవీకావు

20) ఒక శంఖువు 3 సెం.మీ వ్యాసార్థము, 7 సెం.మీ ఎత్తు కలిగియున్న దాని ఘనపరిమాణము ------
a) 64 ఘ.సెం.మీ b) 66 ఘ.సెం.మీ
c) 76 ఘ.సెం.మీ d) ఇవేవీకావు

21) ఒక శంఖువు 6 సెం.మీ వ్యాసము, 4 సెం.మీ ఎత్తు కల్గియున్నది . దాని ఏటవాలు ఎత్తు ------
a) 5 సెం. మీ b) 6 సెం.మీ c) 4 సెం. మీ d) 8 సెం.మీ

22) 14 సెం.మీ వ్యాసము గల శంఖువు భూ వైశాల్యము ------
a) 144 చ. సెం.మీ b) 154 చ.సెం.మీ
c) 164 చ.సెం.మీ d) ఇవేవీకావు

23) 3 సెం.మీ భూ వ్యాసార్థము , 4 సెం.మీ ఎత్తుగల శంఖువు ప్రక్కతలవైశాల్యం.
a) $\frac{330}{7}$ చ. సెం.మీ b) $\frac{320}{7}$ చ. సెం.మీ
c) $\frac{300}{7}$ చ. సెం.మీ d) ఇవేవీకావు

24) 2 సెం.మీ వ్యాసార్థము, 7 సెం.మి ఎత్తుగల స్థూపపు ఘనపరిమాణముకు అంతేకొలతలుగల శంఖువు ఘనపరిమాణముకు గల నిష్పత్తి ------

a) 3 : 1 b) 1 : 3 c) 2 : 3 d) 3 : 2

25) 7 సెం.మీ. వ్యాసార్థము, 3 సెం.మీ ఎత్తుగల స్థూపము సంపూర్ణతల వైశాల్యము ------

a) 396 చ. సెం.మీ b) 386 చ. సెం.మీ

c) 440 చ. సెం.మీ d) ఇవేవీకావు

26) 7 సెం.మీ వ్యాసార్థము, 2 సెం.మీ ఎత్తుగల స్థూపాకారపు పాత్ర లోపలవైపు రేకు బిగించవలెను. ఈ రేకు వైశాల్యము -------

a) 242 చ. సెం.మీ b) 252 చ. సెం.మీ

c) 352 చ. సెం.మీ d) ఇవేవీకావు

27) ఒక స్థూపము వ్యాసార్థము, ఎత్తు 7 : 1 నిష్పత్తి లో ఉన్నది. దాని ఘనపరిమాణము 154 ఘ.సెం.మీ. అయిన దాని వ్యాసార్థము, ఎత్తులు వరుసగా ----------, -------

a) 7 , 1 సెం.మీ b) 1, 7 సెం. మీ

c) 2, 14 సెం.మీ d) 14,2 సెం.మీ

28) ఒక శంఖువు వ్యాసార్థము, ఎత్తులు వరుసగా 3 : 7 నిష్పత్తిలో ఉన్నవి దాని ఘనపరిమాణము 66 ఘ.సెం.మీ. దాని వ్యాసార్థము, ఎత్తులు వరుసగా -------, -------

a) 3, 7 సెం.మీ b) 7, 3 సెం.మీ

c) 6, 14 సెం.మీ d) 14, 6 సెం.మీ

29) ఒకస్థూపము యొక్క ఘనపరిమాణము, ప్రక్కతల వైశాల్యములు సమానము. దాని వ్యాసార్థము ------

a) 2 యూ b) 3 యూ c) 4 యూ d) 1 యూ

30) 4 సెం.మీ. వ్యాసము, 7 సెం.మీ ఎత్తుగల స్థూపపు ఘనపరిమాణమునకు దాని ప్రక్కతల వైశాల్యమునకు గల నిష్పత్తి ------

a) 1 : 1 b) 1 : 2 c) 2 : 1 d) 3 : 1

31) ఒక గోళవ్యాసార్థము 3.5 సెం.మీ. దీని ఉపరితల వైశాల్యము -----

a) $\frac{154}{5}$ చ. సెం.మీ b) $\frac{144}{3}$ చ. సెం.మీ

c) 200 చ. సెం.మీ d) ఇవేవీకావు

32) ఒక గోళపు ఉపరితల వైశాల్యము, ఘనపరిమాణములు సమానమైన ఆ గోళ వ్యాసార్థము ---

a) 3 యూ b) 2 యూ c) 4 యూ d) కనుగొనలేము

33) ఒకగోళము యొక్క ఘనపరిమాణము, వేరొక స్థూపము యొక్క ఘనపరిమాణము సమానము. మరియు గోళవ్యాసార్థము, స్థూపవ్యాసార్థమునకు సమానము. ఆ స్థూపపు ఎత్తు, దాని వ్యాసార్థమునకు గల సంబంధము.

a) $\frac{4}{3}r = h$ b) $h = \frac{3}{4}r$ c) $\frac{3}{2}h = r$ d) కనుగొనలేము

34) ఒక స్థూపము యొక్క ప్రక్కతల వైశాల్యము, అంతే వ్యాసార్థముగల గోళము ఉపరితలవైశాల్యములు సమా ము. అయిన స్థూపపు ఎత్తుకి దాని వ్యాసార్థమునకు గల సంబంధము

a) $h = 2r$ b) $r = 2h$ c) $h = \frac{r}{2}$ d) కనుగొనలేము

35) ఒక స్థూపము యొక్క ఘనపరిమాణము మరియు అంతే వ్యాసార్థముగల గోళము యొక్క ఉపరితల వైశాల్యములు సమానమైన ఆస్థూపపు ఎత్తు -------

a) 4 యూ b) 3 యూ c) 2 యూ d) 1 యూ

## జవాబులు

1) a 2) b 3) a 4) b 5) b
6) c 7) a 8) b 9) b 10) b
11) b 12) b 13) a 14) a 15) a

16) a ఎందువలననగా స్థూపము ఘనపరిమాణము : శంఖుపు ఘనపరిమాణము = $\pi r^2 h : \frac{1}{3}\pi r^2 h$. అయితే రెండింటి r, h లు

సమానము అని ఇవ్వబడింది. కావున $1 : \frac{1}{3}$ అనగా 3 : 1 నిష్పత్తిలో ఉంటాయి.

17) b స్థూపము ఘనపరిమాణము $= \pi r^2 h = \frac{22}{7} \times \sqrt{7} \times \sqrt{7} \times 4 = 88$ ఘ.సెం.

18) a స్థూపము భూపరిధి $2\pi r = 2 \times \frac{22}{7} \times 7 = 44$ సెం.మీ. ఇందులో వ్యాసమివ్వబడింది. కావున వ్యాసార్ధము $(r) = 7$ సెం.మీగా తీసికోవాలి.

19) b స్థూపము సంపూర్ణతలవైశాల్యము $2\pi r (r + h)$; ఇందులో $r = \frac{14}{2} = 7$ సెం.మీ; $h = 3$ సెం.మీ $2 \times \frac{22}{7} \times 7 (7 + 3) = 44 \times 10 = 440$ చ. సెం.మీ

20) b శంఖువు ఘనపరిమాణము $= \frac{1}{3} \pi r^2 h$ కావున ఘనపరిమాణము $= \frac{1}{3} \times \frac{22}{7} \times 9 \times 7 = 66$ ఘ. సెం.మీ

21) a ఏటవాలు ఎత్తు $= \sqrt{r^2 + h^2} = \sqrt{3^2 + 4^2} = 5$ సెం. మీ

22) b శంఖువు భూవైశాల్యము $= \pi r^2$ కావున $r = \frac{14}{2} = 7$ సెం.మీ కావున $\frac{22}{7} \times 7 \times 7 = 154$ చ. సెం.మీ

23) a శంఖువు ప్రక్కతల వైశాల్యము $= \pi r l$ మరియు $l = \sqrt{r^2 + h^2}$ కావున $l = \sqrt{3^2 + 4^2} = 5$ సెం.మీ అగును ప్రక్కతలవైశాల్యము $= \pi r l$ నుంచి $\frac{22}{7} \times 3 \times 5 = \frac{330}{7}$ చ. సెం.మీ

24) a నిష్పత్తిలో r, h లు సమానము కనుక $1 : \frac{1}{3} = 3 : 1$

25) c స్థూపము సంపూర్ణతలవైశాల్యము $= 2 \pi r (r + h)$ కావున $2 \times \frac{22}{7} \times 7(7 + 3) = 440$ చ. సెం.మీ

26) కావలసినరేకు వైశాల్యము $= (\pi r^2 + 2\pi rh)$ ఎందువలననగా రేకు పాత్ర అడుగుభాగము మరియు లోపలి ప్రక్కమాత్రమే

బిగించాలి. కావున అది $\pi r(r + 2h) = \frac{22}{7} \times 7\ (7 + 4) = 22 \times 11 =$ 242 చ. సెం.మీ

27) a స్థూపము వ్యాసార్థము = 7x, ఎత్తు 1x అనుకుంటే, ఇందులో x నిష్పత్తి స్థిరాంకము, స్థూపఘనపరిమాణము $= \pi r^2 h$ కావున $\frac{22}{7} \times 7x \times 7x \times x = 154$ ఘ.సెం.మీ $154\ x^3 = 154 \Rightarrow x =$ 1 కావున దాని వ్యాసార్థము, ఎత్తులు 7 సెం.మీ, 1సెం.మీ

28) a పై సమస్యలోవలె x నిష్పత్తి స్థిరాంకమనుకొంటే వ్యాసార్థము 3x ఎత్తు 7x అవుతాయి. ఘనపరిమాణము $\frac{1}{3}\pi\ r^2\ h$ కావున $= \frac{1}{3} \times \frac{22}{7} \times 3x \times 3x \times 7x = 66 \Rightarrow 66x^3 = 1$ కావున $x =$ 1 అగును. దీన్ని నుండి వ్యాసార్థము 3 సెం.మీ; ఎత్తు 7 సెం.మీ.లు

29) a స్థూపము ఘనపరిమాణము = ప్రక్కతల వైశాల్యం అని ఇవ్వబడింది. కావున $\pi r^2 h = 2 \pi r h \Rightarrow r = 2$ యూ.

30) c వ్యాసార్థము = 4 సెం.మీ.; ఎత్తు = 7 సెం.మీ గల స్థూపఘనపరిమాణము : ప్రక్కతలవైశాల్యము= \f(22,7) × 4\s(2) × 7 : $2 \times \frac{22}{7} \times 4 \times 7 \Rightarrow 2 : 1$ అగును.

31) a గోళఉపరితలవైశాల్యము $= 4 \pi r^2 = 4 \times \frac{22}{7} \times 3.5 \times 3.5 = 154$ చ.సెం.మీ

32) a గోళపరితలవైశాల్యము = గోళఘనపరిమాణము అని ఇవ్వబడింది. కావున $4\pi r^2 = \frac{4}{3}\pi r^3. \therefore r = 3$ యూ.

33) a $\frac{4}{3}\pi r^3 = \pi r^2 h$ అని ఇవ్వబడింది $r = \frac{3h}{4}$ అగును. లేదా $= \frac{4r}{3} = h$ అగును.

34) a $2\pi r h = 4\pi r^2 \Rightarrow h = 2r \Rightarrow r = \frac{h}{2}$ అగును

35) a $4\pi r^2 = \pi r^2 h$ అని ఇవ్వబడింది. కావున $h = 4$ యూనిట్లు

# చతురస్రము - దీర్ఘచతురస్రము

1) చతురస్రము ----- భుజములు కలిగి యుండును

a) 3 b) 4 c) 2 d) 5

2) చతురస్రములో ----- కోణములు ఉండును (భుజములను కలిపినప్పుడు)

a) 4 b) 3 c) 2 d) 5

3) చతురస్రములో భుజములు కొలతలు -----

a) సమానము

b) అసమానము

c) కొన్ని సందర్భములలో సమానము కావు

d) ఇవేవీకావు

4) చతురస్రములో ఉండు కర్ణముల సంఖ్య

a) 1 b) 2 c) 3 d) 4

5) చతురస్రములో కోణములన్నియు

a) సమానము

b) అసమానము

c) సమానము కావలెనన్న నియమములేదు

d) ఇవేవీకావు

6) చతురస్రములో ఒక్కొక్క కోణము -----

a) ఒక లంబకోణము b) రెండులంబకోణములు

c) 60° d) 80°

7) చతురస్రములోని కర్ణముల పొడవులు -----

a) సమానము

b) అసమానము

c) ఖండించుకొనవు

d) ఒకటి రెండవదాని పొడవులో సగము

8) చతురస్రములో కర్ణములు ఒకదాని నొకటి -----

a) ఖండించవు

b) సమద్విఖండనచేసికొనవు

c) లంబసమద్విఖండన చేసికొంటాయి

d) ఇవేవీకావు

9) చతురస్రవైశాల్యము, చతురస్రభుజముకొలత ఇచ్చినప్పుడు

a) $(\text{భుజము})^3$ b) $(\text{భుజము})^2$

c) భుజము × 4 d) ఇవేవీకావు

10) చతురస్రకర్ణము పొడవు ఇచ్చిన, చతురస్రవైశాల్యము -----

a) కర్ణము యొక్క వర్గము b) $\frac{\text{కర్ణముయొక్కవర్గము}}{4}$

c) కర్ణము పొడవు/3 d) $\frac{\text{కర్ణముపొడవుయొక్కవర్గము}}{2}$

11) చతురస్రముయొక్క కర్ణము పొడవు తెలిసిన, దాని భుజము పొడవు -----

a) $\frac{\text{కర్ణముపొడవు}}{2}$ b) $\frac{\text{కర్ణము}}{\sqrt{2}}$

c) $(\text{కర్ణము పొడవు})^2$ d) ఇవేవీకావు

12) చతురస్రమును రెండు ----- త్రిభుజములుగా విభజించవచ్చును.

a) లంబకోణ సమద్విబాహు b) లంబకోణ

c) సమబాహు d) ఇవేవీకావు

13) చతురస్రములో కర్ణము పొడవు (భుజము పొడవు తెలిసిన)

a) $\sqrt{2}$ × భుజము పొడవు b) 2 × భుజము

c) $\frac{\text{భుజముపొడవు}}{4}$ d) ఇవేవీకావు

14) చతురస్రములో కర్ణములు ఖండించుకొన్న బిందువు వద్ద కోణము

a) 80° b) 60° c) 30° d) 90°

15) చతురస్రభుజము కొలత తెలిసిన, దాని చుట్టుకొలత -----

a) $\frac{\text{భుజము}}{4}$ b) $(\text{భుజము})^2$

c) 4 × భుజము d) ఇవేవీకావు

16) ఒక చతురస్ర భుజము పొడవు 4 సెం మీ, దానిచుట్టుకొలత

a) 16 సెం.మీ  b) 16 చ సెం మీ

c) 8 సెం మీ  d) 8 చ సెం మీ

17) ఒకచతురస్ర భుజము పొడవు 2 సెం.మీ, దాని వైశాల్యము

a) 4 సెం మీ  b) 8 సెం.మీ

c) 4 చ.సెం మీ  d) 8 చ.సెం.మీ

18) చతురస్ర కర్ణము పొడవు $4\sqrt{2}$ సెం.మీ. దాని భుజము పొడవు

a) 4 సెం మీ  b) 2 సెం.మీ  c) 3 సెం మీ  d) ఇవేవీకావు

19) ఒక చతురస్ర భుజము పొడవు 3 సెం.మీ. దాని కర్ణము పొడవు

a) $3\sqrt{2}$ సెం మీ  b) $2\sqrt{3}$ సెం.మీ

c) 3 సెం.మీ  d) ఇవేవీకావు

20) ఒక చతురస్ర భుజము పొడవు (a), కర్ణము పొడవు $l$ అయిన

a) $l = \sqrt{2a}$  b) $l = \sqrt{2}\,a$  c) $l = \sqrt{3}\,a$  d) $l = 4a$

21) చతురస్రము గీయవలెనన్న ----- లేదా ----- కొలత తెలియవలెను

a) భుజము లేదా కోణము

b) భుజము లేదా కర్ణము కొలత

c) ఒకటి లేదా 2 భుజముల కొలత

d) ఇవేవీకావు

22) చతురస్రవైశాల్యము (a) దాని భుజము పొడవు ($l$) కు గల సంబంధము

a) $l = a$  b) $l = \sqrt{a}$  c) $l = a^2$  d) ఇవేవీకావు

23) ఒక చతురస్ర చుట్టుకొలత (P), దాని వైశాల్యము (a) కి గల సంబంధం

a) $P = \frac{a}{4}$  b) $P = 4\sqrt{a}$  c) $P^2 = 16\,a$  d) ఇవేవీకావు

24) ఒక చతురస్ర చుట్టుకొలత 40 సెం.మీ. దానివైశాల్యము.

a) 100 సెం.మీ  b) 1000 చ సెం.మీ

c) 50 చ.సెం.మీ d) 50 సెం.మీ

25) ఒక చతురస్ర కర్ణముల లబ్ధము 50 చ.సెం.మీ అయిన దాని వైశాల్యము

a) 25 చ.సెం.మీ b) 25 సెం.మీ

c) 100 సెం.మీ d) 100 చ.సెం.మీ

26) ఒక చతురస్ర కర్ణముల పొడవుల మొత్తము $10\sqrt{2}$ సెం.మీ. అయిన దాని వైశాల్యము

a) 50 చ.సెం.మీ b) 50 సెం.మీ

c) 25 చ.సెం.మీ d) 25 సెం.మీ

27) ఒక చతురస్ర కర్ణము పొడవులో సగము $5\sqrt{2}$ సెం.మీ అయిన. దాని భుజము పొడవు

a) 5 సెం.మీ b) 10 సెం.మీ

c) 15 సెం.మీ d) 20 సెం.మీ

28) ఒక చతురస్రము యొక్క నాలుగు భుజముల పొడవుల మొత్తము 20 సెం. దాని వైశాల్యము -----

a) 25 చ.సెం.మీ b) 25 సెం.మీ

c) 100 చ.సెం.మీ d) 100 సెం.మీ

29) దీర్ఘ చతురస్రములోని భుజముల సంఖ్య -----

a) 3 b) 4 c) 5 d) 2

30) దీర్ఘ చతురస్రములోని కోణముల సంఖ్య -----

a) 3 b) 4 c) 5 d) 2

31) దీర్ఘ చతురస్రములోని ఒక్కొక్క కోణము -----

a) 90° b) 70° c) 60° d) 150°

32) దీర్ఘ చతురస్రములోని కోణముల మొత్తము -----

a) 180° b) 250° c) 360° d) 270°

33) దీర్ఘ చతురస్రములోని కర్ణముల సంఖ్య -------

a) 2 b) 3 c) 4 d) 5

34) దీర్ఘ చతురస్రములో ---- జత సమానభుజములుండును.

a) 1 b) 2 c) 3 d) 4

35) దీర్ఘ చతురస్రములో ఎదురెదురు భుజములు -- -

a) సమానము　　　　　　　b) అసమానము

c) ఒకదాని కొకటి రెట్టింపు　d) ఒకటి రెండవదానిలో సగము

36) దీర్ఘ చతురస్రములో కోణములన్నియు -------

a) సమానము

b) అసమానము

c) సమానము కావచ్చును లేక కాకపోవచ్చును

d) ఇవేవీకావు

37) దీర్ఘచతురస్రములో ఒక్కొక్క కోణము -------

a) 80°　　b) 90°　　c) 70°　　d) 60°

38) దీర్ఘచతురస్రములో కర్ణముల పొడవులు -------

a) అసమానము

b) సమానము

c) సమానము కావలెనన్న నియమము లేదు

d) ఇవేవీకావు

39) దీర్ఘ చతురస్ర వైశాల్యము, దాని భుజముల కొలతలు తెలిసిన

a) పొడవు + వెడల్పు　　　　b) పొడవు × వెడల్పు

c) 2(పొడవు)$^2$　　　　　d) ఇవేవీకావు

40) ఒక దీర్ఘచతురస్రములో భుజముల కొలత ఇచ్చిన దాని చుట్టుకొలత

a) 4(పొడవు + వెడల్పు)　　　b) 2(పొడవు + వెడల్పు)

c) $\frac{\text{పొడవు}}{\text{వెడల్పు}}$　　　　d) ఇవేవీకావు

41) ఒక దీర్ఘచతురస్రములో కర్ణములు ఒకదానినొకటి -------

a) లంబసమద్విఖండన చేసికొనును

b) లంబసమద్విఖండన చేసికొనవు

c) ఖండించుకొనవు

d) ఇవేవికావు

42) ఒక దీర్ఘ చతురస్ర కర్ణము పొడవు తెలిసిన దాని భుజముల కొలత కనుగొనగలమా

a) కనుగొనలేము　　　　b) కనుగొనగలము

c) చెప్పలేము　　　　　d) కొన్ని సార్లు వీలుపడుతుంది

43) ఒకదీర్ఘచతురస్రమును రెండు ------- త్రిభుజముల మొత్తముగా వ్రాయవచ్చును.

a) సమబాహు b) లంబకోణ సమద్విబాహు

c) లంబకోణ d) సమద్విబాహు

44) ఒక ధీర్ఘ చతురస్రములో పొడవు ($l$) వెడల్పు (b) అయిన దాని కర్ణము పొడవు -------

a) $l + b$ b) $l^2 + b^2$ c) $\sqrt{l^2 + b^2}$ d) ఇవేవీకావు

45) ధీర్ఘచతురస్రమును రెండు ------- వైశాల్యములు గల లంబకోణ త్రిభుజములుగా విభజించవచ్చును.

a) సమాన b) అసమాన c) వేర్వేరు d) ఇవేవీకావు

46) ఒకదీర్ఘ చతురస్ర పొడవు 4 సెం.మీ, వెడల్పు 3 సెం.మీ అయిన దాని కర్ణము పొడవు.

a) 2 సెం.మీ b) 3 సెం.మీ c) 5 సెం.మీ d) 6 సెం.మీ

47) ఒక ధీర్ఘచతురస్ర పొడవు 4 సెం.మీ, వెడల్పు 3 సెం.మీ అయిన దాని వైశాల్యము -------

a) 12 సెం.మీ b) 12 చ.సెం.మీ

c) 6 సెం.మీ d) 6 చ.సెం.మీ

48) ఒక ధీర్ఘ చతురస్రపు వైశాల్యము, దాని పొడవు తెలిసిన, దాని వెడల్పు -------

a) వైశాల్యము × పొడవు b) $\frac{\text{వైశాల్యము}}{\text{పొడవు}}$

c) $\frac{\text{పొడవు}}{\text{వైశాల్యము}}$ d) ఇవేవీకావు

49) ఒక దీర్ఘచతురస్రపు వైశాల్యము, వెడల్పు తెలిసిన, దాని పొడవు

a) వైశాల్యము × వెడల్పు b) $\frac{\text{వెడల్పు}}{\text{వైశాల్యము}}$

c) $\frac{\text{వైశాల్యము}}{\text{వెడల్పు}}$ d) ఇవేవీకావు

50) ఒక దీర్ఘ చతురస్రపు కర్ణము పొడవు 5 సెం.మీ, దాని వైశాల్యము 12 చ.సెం.మీ. అయిన ఆ దీర్ఘ చతురస్రపు వెడల్పు

a) 4 మీ b) 3 సెం.మీ c) 3 మీ d) ఇవేవీకావు

51) ఒక దీర్ఘచతురస్రముయొక్క కర్ణముల పొడవుల మొత్తము 10 సెం.మీ ఆ ధర్ఘచతురస్రము పొడవు 4 సెం.మీ ఐన దాని వెడల్పు

a) 5 సెం.మీ b) 3 సెం.మీ c) 2 సెం.మీ d) ఇవేవీకావు

52) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యము 12 చ.సెం.మీ దాని కర్ణముపొడవు 5 సెం.మీ ఆ ధీర్ఘ చతురస్ర పొడవు, వెడల్పు కంటే 1 సెం.మీ ఎక్కువ అయిన దాని పొడవు ------

a) 3 సెం.మీ b) 4 సెం.మీ c) 5 సెం.మీ d) ఇవేవీకావు

53) ఒక దీర్ఘచతురస్రపు కర్ణము పొడవు 13 సెం.మీ అయిన రెండవ కర్ణము పొడవు

a) 12 సెం.మీ b) 11 సెం.మీ

c) 13 సెం.మీ d) ఇవేవీకావు

54) ఒక దీర్ఘచతురస్ర వెడల్పు, కర్ణము పొడవు కంటే 8 సెం.మీ తక్కువ ఆ దీర్ఘ చతురస్రము యొక్క పొడవు 12 సెం.మీ అయిన ఆదీర్ఘచతురస్రపు వెడల్పు.

a) 6సెం.మీ b) 8 సెం.మీ c) 5 సెం.మీ d) 4 సెం.మీ

55) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యము 60 చ.సెం.మీ. దాని కర్ణము పొడవు 13 సెం.మీ అయిన దాని వెడల్పు

a) 6సెం.మీ b) 5 సె.మీ c) 4 సెం.మీ d) ఇవేవీకావు

56) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యము 32 చ.సెం.మీ దాని కర్ణవు పొడవు $4\sqrt{5}$ సెం.మీ అయిన ఆ దీర్ఘచతురస్రపు చుట్టుకొలత

a) 32 సెం.మీ b) 24 సెం.మీ c) 20 సెం.మీ d)36 సెం.మీ

57) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యము 12 చ.సెం.మీ దాని కర్ణము పొడవు 5 సెం.మీ అయిన ఆ దీర్ఘ చతురస్రపు పొడవు, వెడల్పుల బేధము.

a) 4 సెం మీ  b) 3 సెం.మీ  c) 1 సెం.మీ  d) 2సెం మీ

58) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యము 60 చ.సెం మీ దాని కర్ణము యొక్క పొడవు 13 సెం.మీ అయిన ఆ దీర్ఘచతురస్రపు పొడవు, వెడల్పు లమొత్తము ------

a) 18 సెం మీ  b) 17 సెం మీ

c) 20 సెం.మీ  d) ఇవేవీకావు

59) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యములో సగము 24 చ.సెం.మీ. దాని పొడవు 8 సెం.మీ అయిన దాని వెడల్పు ------

a) 6 సెం మీ  b) 4 సెం.మీ  c) 5 సెం.మీ d) 2 సెం మీ

60) ఒక దీర్ఘచతురస్రము యొక్క కర్ణముల పొడవుల మొత్తము 10 సెం.మీ. అయిన ఆ దీర్ఘచతురస్రపు పొడవు, వెడల్పుల వర్గముల మొత్తము.

a) 24 సెం.మీ  b) 20 సెం.మీ

c) 25 సెం.మీ  d) చెప్పజాలము

61) ఒకదీర్ఘచతురస్రము యొక్క ఒక కర్ణము పొడవు 5 సెం.మీ దాని పొడవు, వెడల్పుల వర్గాల మొత్తము

a) 25 సెం.మీ  b) 10 సెం.మీ

c) 20 సెం.మీ  d) ఇవేవీకావు

62) ఒక దీర్ఘచతురస్రపు కర్ణముల పొడవుల మొత్తము 26 సెం.మీ దాని వెడల్పు 5 సెం.మీ అయిన ఆ దీర్ఘచతురస్రపు పొడవు

a) 20 సెం.మీ  b) 18 సెం.మీ

c) 16 సెం.మీ  d) 12 సెం.మీ

63) ఒక దీర్ఘచతురస్రపు కర్ణముల పొడవుల మొత్తములో సగము 13 సెం.మీ దాని పొడవు 12 సెం.మీ. అయిన దానివైశాల్యము

a) 60 సెం.మీ  b) 60 చ.సెం మీ

c) 156 చ.సెం.మీ  d) 156చ.సెం.మీ

64) ఒక దీర్ఘచతురస్రపు కర్ణముల పొడవుల మొత్తములో సగము 5 సెం.మీ. ఆదీర్ఘచతురస్రపు పొడవు 4 సెం.మీ అయిన దాని చుట్టుకొలత

a) 14 చ.సెం.మీ b) 14 సెం.మీ
c) 15 సెం.మీ d) 18 చ.సెం.మీ

65) ఒక దీర్ఘచతురస్రము యొక్క కర్ణముల పొడవుల మొత్తము 26 సెం.మీ ఆ దీర్ఘచతురస్రపు పొడవు 12 సెం.మీ అయిన దాని చుట్టుకొలత
a) 36 సెం.మీ b) 34 సెం.మీ
c) 72 సెం.మీ d) 38 సెం.మీ

66) ఒక దీర్ఘ చతురస్రపు కర్ణముల పొడవుల లబ్ధము 25 చ.సెం.మీ ఆ దీర్ఘ చతురస్రపు పొడవు 4 సెం.మీ అయిన దాని వెడల్పు
a) 6 సెం.మీ b) 5 సెం.మీ c) 3 సెం.మీ d) ఇవేవీకావు

67) ఒక దీర్ఘచతురస్రము యొక్క కర్ణముల పొడవుల లబ్ధార్థము 84.5 చ.సెం.మీ ఆ దీర్ఘచతురస్రపు వెడల్పు 5 సెం.మీ. అయిన దాని పొడవు.
a) 12 సెం.మీ b) 13 సెం.మీ c) 4 సెం.మీ d) ఇవేవీకావు

68) ఒక దీర్ఘచతురస్రము యొక్క వైశాల్యము (a), దాని కర్ణము పొడవు (P) ఇచ్చిన ఆదీర్ఘచతురస్ర పొడవు, వెడల్పుల మొత్తము------
a) కనుగొనగలము b) కనుగొనలేము
c) అన్నివేళల సాధ్యముకాదు d) ఇవేవీకావు

69) ఒకదీర్ఘచతురస్రపువైశాల్యము (x) ఆ దీర్ఘచతురస్రపు కర్ణము యొక్క పొడవు (P) ఇచ్చిన ఆ దీర్ఘచతురస్రపు పొడవు, వెడల్పుల భేదము.
a) $\sqrt{P^2 - x}$ b) $\sqrt{P^2 - 2x}$ c) $\sqrt{2x - P^2}$ d) $P^2 - 2x$

70) ఒక దీర్ఘచతురస్రపు వైశాల్యము (x) ఆ దీర్ఘచతురస్రపు కర్ణము పొడవు 'P' ఇచ్చిన ఆ దీర్ఘచతురస్రపు పొడవు, వెడల్పుల మొత్తము
a) $\sqrt{P^2 - x}$ b) $\sqrt{P^2 - 2x}$
c) $\sqrt{P^2 + 2x}$ d) $(P^2 + 2x)$

71) ఒక చతురస్ర వైశాల్యము 64 చ.సెం.మీ. దీని భుజమంత వెడల్పు కలిగి, వెడల్పుకంటే 2 సెం.మీ ఎక్కువ పొడవు గల్గిన దీర్ఘచతురస్రపు వైశాల్యము

a) 70 చ.సెం.మీ b) 80 చ.సెం.మీ

c) 90 చ.సెం.మీ d) 100 చ.సెం.మీ

72) ఒక చతురస్ర వైశాల్యము 36 చ.సెం.మీ. దీని భుజమంత పొడవు కలిగి, పొడవు కంటే 3 సెం.మీ తక్కువ వెడల్పు కలిగిన దీర్ఘచతురస్రపు వైశాల్యము

a) 15 చ.సెం.మీ b) 54 చ.సెం.మీ

c) 18 చ.సెం.మీ d) 24 చ.సెం.మీ

73) ఒక దీర్ఘచతురస్ర వైశాల్యము 30 చ.సెం.మీ దాని పొడవు, వెడల్పుకంటే 1 సెం.మీ ఎక్కువ. అయిన ఆ దీర్ఘ చతురస్రపు కొలతలు

a) 6 సెం.మీ, 5 సెం.మీ b) 7 సెం.మీ, 5సెం.మీ

c) 8 సెం.మీ, 7 సెం.మీ d) 13 సెం.మీ, 12 సెం.మీ

74) ఒక చతురస్రపు వైశాల్యము 49 చ.సెం.మీ. దాని భుజము కొలత కంటే 2 సెం.మీ అధికంగాను ,అంతే వెడల్పు ఉన్న దీర్ఘచతురస్ర వైశాల్యము.

a) 63 సెం.మీ b) 63 చ.సెం.మీ

c) 72 చ.సెం.మీ d) ఇవేవీకావు

75) ఒక దీర్ఘ చతురస్రపు పొడవు దాని వెడల్పు కంటే 1 సెం.మీ. ఎక్కువ. దాని కర్ణము పొడవు 5 సెం.మీ. అయిన దాని వెడల్పు.

a) 4 సెం.మీ b) 3 సెం.మీ

c) 2 సెం.మీ d) కనుగొనలేము

76) ఒక దీర్ఘచతురస్రపు కర్ణము యొక్క పొడవు వర్గము నుంచి ఆదీర్ఘ చతురస్ర పొడవు, భుజము కొలత గల చతురస్ర వైశాల్యమును తీసివేస్తే 9 వచ్చింది. అయిన ఆ దీర్ఘ చతురస్రపు వెడల్పు.

a) 3 సెం.మీ b) 4 సెం.మీ c) 5 సెం.మీ d) కనుగొనలేము.

77) ఒక దీర్ఘ చతురస్రపు కర్ణము పొడవు, ఒక చతురస్రపు కర్ణము పొడవుకు సమానము. దీర్ఘచతురస్రపు కర్ణము పొడవు 5 సెం.మీ. అయిన ఆ చతురస్రపు భుజము

a) $5\sqrt{2}$ సెం.మీ b) $\frac{5}{2}\sqrt{2}$ సెం.మీ

c) $\frac{5}{2}$ సెం.మీ d) ఇవేవీకావు

78) ఒక చతురస్ర కర్ణము పొడవు, దీర్ఘ చతురస్ర కర్ణము పొడవు (d) లనిష్పత్తి $\sqrt{2} : 1$ గా ఉన్నది. అనగా -----

a) చతురస్ర భుజము = d కావాలి

b) చతురస్రకర్ణము = d

c) చతురస్రవైశాల్యము d కావాలి

d) ఇవేవీకావు

79) ఒక చతురస్రము, దీర్ఘచతురస్రము ఒకే చుట్టుకొలతను కలిగి ఉన్నవి. అయిన ఆదీర్ఘచతురస్రపు పొడవు, వెడల్పుల మొత్తము ------- కు సమానము

a) 4 × చతురస్రభుజము

b) 2 × చతురస్రభుజము

c) 3 × చతురస్రభుజము

d) చతురస్రపు భుజముకొలత

80) ఒక చతురస్ర వైశాల్యము, దీర్ఘచతురస్ర చుట్టుకొలతకు సమానము. దీర్ఘచతురస్రపు పొడవు, దాని వెడల్పుకంటే 2 సెం.మీ ఎక్కువ. మరియు చతురస్రపు భుజము. దీర్ఘ చతురస్రపు వెడల్పుకంటే 7 సెం.మీ తక్కువ అయిన ఆ దర్ఘచతురప్రపు వెడల్పు.

a) 12 సెం.మీ b) 15 సెం.మీ

c) 17 సెం.మీ d) 10 సెం.మీ

81) ఒక చతురస్రపు వైశాల్యము, దీర్ఘచతురస్రపు చుట్టుకొలతకి సమానము. చతురస్రపు భుజము కొలత 6 సెం.మీ. అయిన ఆ ఆ దీర్ఘ చతురస్రపు పొడవు (*l*), దాని వెడల్పు (b) ల మధ్య సంబంధము

a) $l = 18 + b$ b) $l = 18 - b$ c) $l = b - 18$ d) ఇవేవీకావు

82) ఒక దీర్ఘ చతురస్రాకారపు గదిలో బండ పర్చుటకు రు. 1000 లు ఖర్చు అయినది. 1 చ.మీ కి 10 రు.లు ఖర్చు అయిన ఆ గది వైశాల్యము

a) 100 చ.మీ. b) 200 చ.మీ

c) 150 చ.మీ d) ఇవేవీ కావు

83) ఒక దీర్ఘచతరస్రాకారపు గది చుట్టు కొలత 100 మీ, దాని పొడవు, వెడల్పుల నిష్పత్తి 4 : 1 అయిన దాని పొడవు

a) 40 మీ b) 10 మీ c) 20 మీ d) 50 మీ

84) ఒక దీర్ఘ చతురస్రముయొక్క వైశాల్యము 90 చ.మీ. దాని పొడవు, వెడల్పుల 10 : 1 నిష్పత్తిలో ఉన్న దాని పొడవు

a) 40 మీ b) 30 మీ c) 20 మీ d) 25 మీ

85) ఒక దీర్ఘ చతురస్ర వైశాల్యము 72 చ.సెం.మీ దాని వైశాల్యములో సగము వైశాల్యము గల చతురస్ర భుజము

a) 5 సెం.మీ b) 4 సెం.మీ c) 6 సెం మీ d) ఇవేవీకావు

86) చతురస్ర వైశాల్యము, దీర్ఘ చతురస్ర వైశాల్యములో 4 వవంతు చతురస్ర వైశాల్యము 36 చ.సెం.మీ. అయిన దీర్ఘ చతురస్ర వైశాల్యము

a) 9 చ.సెం.మీ b) 144 చ సెం.మీ

c) 72 చ.సెం.మీ d) ఇవేవీకావు

87) ఒక దీర్ఘ చతురస్రపు వైశాల్యము, చతురస్ర వైశాల్యమునకు రెట్టింపు. చతురస్ర వైశాల్యము 36 చం.సెం.మీ అయిన దీర్ఘ చతురస్ర వైశాల్యము

a) 72 చ.సెం.మీ b) 144 చ.సెం.మీ

c) 18 చ.సెం.మీ d) ఇవేవీ కావు

88) ఒక దీర్ఘ చతుర్రస్ర చుట్టుకొలత 90 సెం.మీ. దాని పొడవు, వెడల్పులు 4 : 1 నిష్పత్తిలో ఉన్నవి. అయిన దాని పొడవు

a) 90 సెం.మీ b) 36 సెం.మీ c) 45 సెం.మీ d) ఇవేవీకావు

89) ఒక దీర్ఘ చతురప్ర వైశాల్యము 324 చ.సెం.మీ దాని పొడవు, వెడల్పులు 4 : 1 నిష్పత్తిలో ఉన్నవి. దాని వెడల్పు

a) 18 సెం.మీ b) 10 సెం.మీ c) 9 సెం.మీ d) ఇవేవీ కావు

90) ఒక దీర్ఘ చతురస్రపు పొడవు 12 మీ. దాని వెడల్పు 5 మీ. అయిన దాని కర్ణము పొడవు

a) 15 సెం.మీ b) 13 సెం.మీ
c) 14 సెం.మీ d) ఇవేవీ కావు

91) ఒక చతురస్ర వైశాల్యము (A) దాని కర్ణము (d) కు గల సంబంధము

a) $A = \sqrt{2D}$ b) $A = \sqrt{2}\, D$ c) $\sqrt{2A} = D$ d) ఇవేవీ కావు

92) ఒక చతురస్రపు గదిలో బండ పర్చుటకు 5000 రు.లు అయినవి. బండ చ.మీ. ఖరీదు 2 రు.లు. అయిన ఆ గది భుజము కొలత

a) 25 మీ b) 50 మీ c) 40 మీ d)ఇవేవీకావు

93) ఒక లంబకోణ త్రిభుజ వైశాల్యము 12 చ.సెం.మీ. దీనికి మరియొక లంబకోణ త్రిభుజము కలిపి దీర్ఘ చతురస్రముగా చేసినారు. దాని వైశాల్యము -----

a) 6 సెం.మీ. b) 24 చ.సెం.మీ.
c) 6 చ.సెం.మీ. d) 24 సెం.మీ.

94) ఒక చతురస్ర వైశాల్యము 49 చం.సెం.మీ మరొక దీర్ఘ చతురస్రపు వైశాల్యము 12 చ.సెం.మీ చతురస్ర భుజము, దీర్ఘ చతురస్ర పొడవు వెడల్పుల మొత్తము అయిన దీర్ఘ చతురస్ర పొడవు, వెడల్పుల భేదము.

a) 4 సెం.మీ b) 3 సెం.మీ c) 1 సెం.మీ d) 2 సెం.మీ

95) ఒక దీర్ఘ చతురస్ర వైశాల్యము 60 చ.సెం.మీ ఈ దీర్ఘ చతురస్రపు పొడవు, వెడల్పుల మొత్తము భుజముగా గల చతురస్ర వైశాల్యము 289 అయిన ఆ దీ.చ. పొడవు, వెడల్పుల మొత్తము

a) 10 సెం.మీ b) 17 సెం.మీ c)15 సెం.మీ d) ఇవేవీకావు

96) ఒక దీర్ఘ చతురస్ర కర్ణము పొడవు 5 సెం.మీ. ఆ దీర్ఘ చతురస్ర పొడవు, వెడల్పుల తేడా 1 సెం.మీ. అయిన ఆ దీర్ఘ చతురస్ర వైశాల్యము

a) 15 చ.సెం.మీ b) 12 చ.సెం.మీ
c) 20 చ.సెం.మీ d) కనుగొనలేము

97) ఒక దీర్ఘ చతురస్ర కర్ణము పొడవు 13 సెం.మీ. ఆ దీర్ఘ చతురస్ర పొడవు, వెడల్పుల తేడా 7 సెం.మీ అయిన ఆ దీర్ఘ చతురస్ర వైశాల్యము
a) 60 చ.సెం.మీ b) 12 చ.సెం.మీ
c) 50 చ.సెం.మీ d) ఇవేవీ కావు

98) ఒక దీర్ఘ చతురస్రపు కర్ణము పొడవు 5 సెం.మీ. ఆ దీర్ఘ చతురస్రపు పొడవు, వెడల్పుల మొత్తము 7 సెం.మీ అయిన ఆ దీర్ఘ చతురస్ర వైశాల్యము
a) 60 చ.సెం.మీ b) 12 చ.సెం.మీ
c) 16 చ.సెం.మీ d) 24 చ.సెం.మీ

99) ఒక దీర్ఘ చతురస్రపు కర్ణము పొడవు 5 సెం.మీ. ఆ దీర్ఘ చతురస్ర పొడువు , వెడల్పుల మొత్తము 7 సెం.మీ. అయిన ఆ దీర్ఘ చతురస్ర పొడవు ------
a) 4 సెం.మీ b) 8 సెం.మీ c) 2 సెం.మీ d) ఇవేవీ కావు

100) ఒక దీర్ఘ చతురస్రపు కర్ణము పొడవు 5 సెం.మీ. ఆ దీర్ఘ చతురస్ర పొడవు, వెడల్పుల తేడా 1 సెం.మీ. అయిన ఈ దీర్ఘ చతురస్ర పొడవు
a) 4 సెం.మీ b) 3 సెం.మీ c) 2 సెం.మీ d) ఇవేవీ కావు

## జవాబులు

| | | | | |
|---|---|---|---|---|
| 1) b | 2) a | 3) a | 4) b | 5) a |
| 6) a | 7) a | 8) c | 9) b | 10) d |
| 11) b | 12) a | 13) a | 14) d | 15) c |
| 16) a | 17) c | 18) a | 19) a | 20) b |
| 21) b | 22) b | | | |

23) c ఎందుకనగా చతురస్రపు చుట్టుకొలత = 4 × భుజము; దాని వైశాల్యము = (భుజము)$^2$ కావున P = 4 × భుజము మరియు $P^2 = (4 \times \text{భుజము})^2$ అవగా $P^2$ = 16 × a అగును.

# లిటిల్ మాస్టర్స్

# అంకగణితం

(ఆబ్జెక్టివ్ ప్రశ్నలు - సమాధానములు)

సి. యస్. ఆర్. సి. మూర్తి

నవరత్న బుక్ సెంటర్

కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 520 002.

$$\sqrt{\left(\frac{12}{b}\right)^2 + b^2} = 5 \Rightarrow \frac{144}{b^2} + b^2 = 25 \Rightarrow \frac{144 + b^4}{b^2} =$$
25 అనగా $144 + b^4 = 25b^2 \Rightarrow b^4 - 25b^2 + 144 = 0$ అగును.
అనగా $b^4 - 16b^2 - 9b^2 + 144 = 0 \Rightarrow b^2 (b^2 - 16) - 9(b^2 16) = 0$
$\Rightarrow (b^2 - 16)(b^2 - 9) = 0$ $b = 3$ లేక 4 సెం.మీ. కావున 3 సెం.మీ జవాబుగా వ్రాయవలెను.

51) b దీర్ఘచతురస్ర కర్ణముల పొడవులు సమానము. కావున $2\sqrt{l^2 + b^2} = 10$ సెం.మీ మరియు $l = 4$ సెం.మీ అని ఇవ్వబడినది. $l^2 + b^2 = 25$ దీనిలో $l = 4$ అని ప్రతిక్షేపిస్తే $b^2 = 9$ అగును. కావున $b = 3$ సెం.మీ

52) b దీర్ఘచతురస్ర పొడవు ($l$) వెడల్పు (b) అనుకొన్న $lb =$ 12 చ.సెం.మీ అనియు $\sqrt{l^2 + b^2} = 5$ సెం.మీ మరియు $l = (b + 1)$ సెం.మీ అనియు ఇవ్వబడినది. $\therefore l = \frac{12}{b}$ అని $l^2 + b^2 = 25$ లో ప్రతిక్షేపిస్తే $\left(\frac{12}{b}\right)^2 + b^2 = 25 \Rightarrow b^4 - 25b^2 + 144 = 0$ అనగా 50 వ సమస్యవలెనే సాధిస్తే $b = 3$ సెం.మీ అగును. కాని $l^2 + b^2 = 25$ కావున $l^2 = 25 - 9 = 16 \Rightarrow l = 4$ సెం.మీ. దీనిని మరో విధంగా కూడ సాధించవచ్చును. దీర్ఘ చతురస్రమును రెండు లంబ కోణ త్రిభుజములుగా విభజించవచ్చు. పైథాగరస్ సిద్ధాంతము ప్రకారము $l^2 + b^2 =$ కర్ణము$^2$ అగును. కాని $l = (b + 1)$ అని ఇవ్వబడినది. కావున $(b + 1)^2 + b^2 = 25$ $\therefore b^2 + 1 + 2b + b^2 = 25 \Rightarrow 2b^2 + 2b - 24 = 0$ అనగా $b^2 + b - 12 = 0$ కావున $b^2 + 4b - 3b - 12 = 0 \Rightarrow (b + 4)(b - 3) = 0$ అగును. అంటే $b = 3$ సెం.మీ.
$\therefore$ పొడవు $= 3 + 1 = 4$ సెం.మీ

53) c: దీర్ఘ చతురస్రములో కర్ణముల పొడవులు సమానము.

54) c: కర్ణము పొడవు ($\sqrt{l^2 + b^2} = b + 8$) అనియు, $l = 12$ అనియు ఇవ్వబడింది. $12^2 + b^2 = (b + 8)^2$ గా వ్రాయవచ్చును. $144 + b^2 = b^2 + 16b + 64$ అవుతుంది. $16b = 144 - 64 \Rightarrow b = \frac{80}{16} = 5$ సెం.మీ.

55) b $\sqrt{l^2 + b^2} = 13$ ; $lb = 60$; $l = \frac{60}{b}$ అని ప్రతిక్షేపించి, వర్గసమీకరణమును పొంది, సాధిస్తే $b = 5$ సెం.మీ అగును.

56) b $lb = 32$ ; $\sqrt{l^2 + b^2} = 4\sqrt{5} \Rightarrow l^2 + b^2 = 80$ లో $l = \frac{b}{32}$ అని ప్రతిక్షేపించి సాధిస్తే $l = 8, b = 4$ సెం.మీ గా వస్తాయి. చుట్టుకొలత = 2 (l + b) నుండి 2(8 + 4) = 24 సెం.మీ అగును.

57) c $lb = 12$; $l^2 + b^2 = 25$ లనుండి $(l - b)^2$ కనుగొంటే, అనగా $l^2 + b^2 - 2lb = 25 - 24$ నుండి $(l - b)^2 = 1 \Rightarrow l - b = 1$

58) b $lb = 60$ ; $l^2 + b^2 = 169$ లనుండి $l^2 + b^2 + 2lb = 169 + 120$ అగును. $(l + b) = \sqrt{289} \Rightarrow (l + b) = 17$ సెం.మీ

59) a $lb = 48$ చ.సెం.మీ; $b = \frac{lb}{l}$ నుండి $b = \frac{48}{8} = 6$ సెం.మీ

60) c కర్ణము యొక్క పొడవు 5 సెం.మీ అనగా $\sqrt{l^2 + b^2} =$ 5 సెం.మీ. $\therefore l^2 + b^2 = 25$ సెం.మీ ఇందులో కర్ణముల పొడవులు సమానము.

61) a $\sqrt{l^2 + b^2} = 5$ కావున $l^2 + b^2 = 25$ సెం.మీ

62) d ఒక కర్ణము యొక్క పొడవు 13 సెం.మీ; $l^2 + b^2 = 169$ ; $l^2 = 169 - 25$ అనగా $l = \sqrt{144} = 12$ సెం.మీ.

63) b కర్ణము పొడవుల మొత్తములో సగము అనగా ఒక కర్ణము పొడవు అని అర్ధము. $l^2 + b^2 = 169 \Rightarrow b^2 = 169 - 144 = 25$ కావున $b = 5$ సెం.మీ. కాబట్టి వైశాల్యము = $12 \times 5 = 60$ చ.సెం.మీ.

64) b పైథాగరస్ సిద్ధాంతము నుండి లంబకోణ త్రిభుజంలో భుజముల మీది వర్గాల మొత్తము = కర్ణము$^2$.

$\therefore 5^2 - 4^2 = b^2 \Rightarrow b = 3$ సెం.మీ కావున చుట్టు కొలత = 2(4 + 3) = 14 సెం.మీ

65) b పై సమస్యలో వలెనే $b^2 = 13^2 - 12^2 = 25$ కావున $b =$ 5 సెం.మీ. కావున చుట్టుకొలత = 2(12 + 5) = 34 సెం.మీ

66) c కర్ణములు సమాన పొడవు కల్గి యుంటాయి కావున కర్ణము\s(2) = 25 ∴ కర్ణము పొడవు = 5 సెం.మీ. దాని వెడల్పు = $\sqrt{25 - 16}$ = 3 సెం.మీ.

67) a కర్ణముల పొడవుల యొక్క లబ్ధము = 84.5 × 2 = 169 దీని నుండి కర్ణము పొడవు = \r(169) = 13, దాని పొడవు = $\sqrt{13^2 - 25}$ = 12 సెం.మీ.

68) a దీర్ఘచతురస్రము యొక్క కర్ణము పొడవు యొక్క వర్గమునకు ఆ దీర్ఘ చతురస్రవైశాల్యమును రెట్టింపు చేసి కలిపిన, పొడవు, వెడల్పుల మొత్తము యొక్క వర్గము విలువ తెలుస్తుంది. దీని వర్గమూలము కనుగొనిన పొడవు, వెడల్పుల మొత్తము విలువ తెలుస్తుంది.

69) b పైన సమస్యలో చెపిపనట్లుగా చేయవలెను. అయితే ఇక్కడ భేధము కనుగొనవలెను కావున దీర్ఘ చతురస్రవైశాల్యము యొక్క రెట్టింపు విలువ తీసి వేయవలసి ఉంటుంది.

70) c పై సమస్య వలెనే సాధిస్తాము.

71) b చతురస్రభుజము = $\sqrt{64}$ = 8 సెం.మీ. కావున దీర్ఘ చతురస్ర వెడల్పు 8 సెం.మీ. దాని పొడవు (8 + 2) = 10 సెం.మీ. దీని వైశాల్యము 80 చ.సెం.మీ.

72) c కావలసిన దీర్ఘ చతురస్రపు పొడవు = $\sqrt{36}$ = 6 సెం.మీ; దీని వెడల్పు = 6 – 3 = 3 సెం.మీ; దాని వైశాల్యము = 18 చ. సెం.మీ.

73) a దీర్ఘచతురస్ర వైశాల్యము (lb) = 30 చ. సెం.మీ మరియు $l = (b + 1)$ సెం.మీ. కావున $b(b + 1) = 30 \Rightarrow b^2 + b - 30 = 0$ అగును. $b^2 + 6b - 5b - 30 = 0 \Rightarrow b(b+6) - 5(b + 6) = 0 \Rightarrow b = 5$ సెం.మీ

74) b దీర్ఘచతురస్ర వెడల్పు = $\sqrt{49}$ = 7 సెం.మీ; దీర్ఘ చతురస్ర పొడవు = 7 + 2 = 9 సెం.మీ. దాని వైశాల్యము = 9 × 7 = 63 చ. సెం.మీ

75) b  దీర్ఘచతురస్ర వెడల్పును b అనుకొంటే, దాని పొడవు (b + 1) సెం.మీ అగును. ఏర్పడే లంబకోణ త్రిభుజం నుండి $b^2 + (b + 1)^2 = 25$

$\therefore 2b^2 + 1 + 2b = 25$ దీని నుండి $b^2 + b - 12 = 0 \Rightarrow (b$ 3) $(b + 4) = 0$ కావున వెడల్పు = 3 సెం.మీ

76) a  దీర్ఘ చతురస్ర పొడవు (l), వెడల్పు (b) అనుకొంటే, చతురస్ర భుజము కూడ (l) అగును. కావున $l^2 + b^2 - l^2 = 9$ అగును. అంటే $b^2 = 9 \Rightarrow b = 3$ సెం.మీ

77) b  $\sqrt{l^2 + b^2} = 5$ సెం.మీ. కావున చతురస్ర కర్ణము పొడవు 5 సెం.మీ $\sqrt{2}$ × చతురస్రభుజము = 5 సెం.మీ ⇒ చతురస్రభుజము = $\frac{5}{\sqrt{2}}$ సెం.మీ దీనిలో లవ, హారములను $\sqrt{2}$ చే గుణిస్తే $\frac{5\sqrt{2}}{2}$ సెం.మీ. వస్తుంది.

78) a  $\sqrt{2}$ × చతురస్ర భుజము = చతురస్ర. కర్ణము పొడవు దీర్ఘ చతురస్ర కర్ణము పొడవు (d) అని ఇవ్వబడింది. కావున వీటి నిష్పత్తి $\sqrt{2}$ × చతురస్ర భుజము : d అగును. కాని ఈ విలువ $\sqrt{2}$ : 1 అని ఇవ్వబడింది. కావున చతురస్ర భుజము = d కావాలి

79) b  చతురస్ర భుజము × 4 = 2 (దీ.చ.పొడవు, వెడల్పుల మొత్తము అని ఇవ్వబడింది. కావున 2 × చతురస్ర భుజము = దీ.చ. పొడవు, వెడల్పుల మొత్తము

80) b  దీర్ఘచతురస్ర వెడల్పు b సెం.మీ. అనుకొంటే, దాని పొడవు (b + 2) సెం.మీ చతురస్రపు భుజము (b - 7) సెం.మీ అగును. అయితే $(b - 7)^2 = 2(b + 2 + b)$ అగును. $b^2 + 49 - 14b = 4b + 4 \Rightarrow b^2 - 18b + 45 = 0 \Rightarrow b^2 - 15b - 3b + 45 = 0$ కావున $b(b - 15) - 3(b - 15) = 0 \Rightarrow b = 3$ లేక 15 సెం.మీ. కావలెను. 3 సెం.మీ వెడల్పుగా తీసికొంటే చతురస్రము కొలత 'నెగిటివ్' విలువ అవుతుంది. (3 - 7 = b - 7) కావున). అందువల్ల b = 15 = 15 సెం.మీ. అగును.

81) b  చతురస్ర వైశాల్యము = $6^2$ = 36 చ. సెం.మీ; దీర్ఘ చతురస్ర చుట్టుకొలత = $2(l + b)$ కావున $2(l + b) = 36 \Rightarrow (l + b) = 18$ $\therefore l = (18 - b)$ అవుతుంది.

82) a  1 చ.మీ. కి ఖర్చు = 10 రు. మొత్తము అయిన ఖర్చు = 1000రు. కావున ఆ దీర్ఘచతురస్ర వైశాల్యము = $\frac{1000}{10}$ = 100 చ.మీ

83) a  దీర్ఘచతురస్ర పొడవు, వెడల్పులు వరుసగా l, b అనుకుంటే, $2(l + b) = 100 \Rightarrow (l + b) = 50$ మీ. నిష్పత్తి స్థిరాంకము విలువ 'x' అనుకుంటే $4x + x = 50$ మీ. అగును. $\Rightarrow x = \frac{50}{5}$ = 10 మీ. కావున పొడవు $4 \times 10 = 40$ మీ.

84) b  పై లెక్కలో వలెనే సాధిస్తే $lb = 90$ చ.మీ. $10x \times x = 90$ అగును $x^2 = 9 \Rightarrow x = 3$ కావున పొడవు $10 \times 3 = 30$ మీ.

85) c  పొడవు, వెడల్పులు వరుసగా l, b లు అనుకుంటే $lb = 72$ దీనిలో సగము విలువ, చతురస్ర వైశాల్యమునకు సమానము కావున చతురస్ర భుజము = $\sqrt{\frac{72}{2}}$ = 6 సెం.మీ

86) b  దీర్ఘచతురస్ర వైశాల్యము = 4 × చతురస్ర వైశాల్యము అని ఇవ్వబడినది. చతురస్ర వైశాల్యము 36 చ. సెం.మీ కావున దీర్ఘ చతురస్ర వైశాల్యము = $4 \times 36 = 144$ చ. సెం.మీ.

87) a  దీర్ఘచతురస్ర వైశాల్యము = 2 × చతురస్ర వైశాల్యము అనియు, చతురస్ర వైశాల్యము 36 చ. సెం.మీ. అనియు ఇవ్వబడింది. కావున దీ.చ. వైశాల్యము = $36 \times 2 = 72$ చ.సెం.మీ.

88) b  $2(4x + x) = 90$ అని ఇవ్వబడింది. ఇందులో 'x' నిష్పత్తి స్థిరాంకము $5x = 45 \Rightarrow x = 9$ కావున పొడవు 36 సెం.మీ.

89) c  $4x^2 = 324$ అని ఇవ్వబడింది. ఇందులో x నిష్పత్తి స్థిరాంకము $x^2 = \frac{324}{4} = 81 \Rightarrow x = \sqrt{81} = 9$ కావున పొడవు $9 \times 4 = 36$ సెం.మీ మరియు వెడల్పు $1 \times 9 = 9$ సెం.మీ

90) b  దీర్ఘచతురస్ర కర్ణము పొడవు = $\sqrt{l^2 + b^2}$ అని తెలుసు

91) c  చతురస్ర కర్ణము (d) ; (భుజము)$^2$ = వైశాల్యము; $d = \sqrt{2}$ భుజము అని తెలుసు. అయిన $d = \sqrt{2 \times భుజము^2}$ గా కూడ వ్రాయవచ్చును. కావున $d = \sqrt{2A}$ అగును.

92) b  చతురస్రవైశాల్యము = $\frac{\text{మొత్తము అయిన ఖర్చు}}{\text{చ.మీ.కి అయిన ఖర్చు}} = \frac{5000}{2}$ = 2500 ∴ ఆ చతురస్రపు భుజము = $\sqrt{2500}$ = 50 మీ.

93) b  దీర్ఘ చతురస్రము వైశాల్యము = ఆ రెండు త్రిభుజముల మొత్తమువైశాల్యము.

94) c  చతురస్ర భుజము = $\sqrt{49}$ = 7 సెం.మీ దీర్ఘ చతురస్రము యొక్క పొడవు, వెడల్పుల మొత్తము 7 సెం.మీ అనగా $(l + b) = 7$ సెం.మీ దీర్ఘ చతురస్ర వైశాల్యము $(lb) = 12$ చ.సెం.మీ ; $(l - b)^2 = (l + b)^2 - 4lb$ అనే సూత్రము నుండి $(l - b)^2 = 49 - 48 = 1$ కావున $(l - b) = 1$ సెం.మీ

95) b  చతురస్ర భుజము $(l + b)$ అనియు $(l + b)^2 = 289$ అనియు, $lb = 60$ అనియు ఇవ్వబడింది ($l, b$ లు దీర్ఘ చతురస్రము యొక్క పొడవు, వెడల్పులు) $l + b = 17$ సెం.మీ. ఈ లెక్కలో దీర్ఘ చతురస్ర వైశాల్యము ఇవ్వడం వలన ఉపయోగమేమీలేదు.

96) b  దీ.చ.పొడవు, వెడల్పులు వరుసగా $l, b$ అనుకొంటే $\sqrt{l^2 + b^2} = 5$ అనియు, $(l - b) = 1$ అనియు ఇవ్వబడినది. $(l - b)^2 - (l^2 + b^2) = -2lb$ అని తెలుసు కావున $1^2 \cdot 25 = -2lb \Rightarrow$ $2lb = 24$ $lb = 12$

97) a  పై లెక్కవలెనే సాధించవలెను.

98) b  దీ.చ.పొడవు, వెడల్పులను వరుసగా $l, b$ అనుకుంటే $l + b = 7$ అనియు $\sqrt{l^2 + b^2} = 5$ సెం.మీ. అనియు ఇవ్వబడినది $(l + b)^2 - (l^2 + b^2) = 2lb$ అని తెలుసు. $49 - 25 = 2\,lb$ అగును. కావున ఆ దీ.చ.వైశాల్యము $(lb) = \frac{24}{2} = 12$ చ.సెం.మీ

99) a  దీ.చ పొడవు, వెడల్పులు వరుసగా $l, b$ అనుకుంటే $l + b = 7$ సెం.మీ $\sqrt{l^2 + b^2} = 5$ సెం.మీ అని ఇవ్వబడింది.

$\frac{(l + b)^2 - (l^2 + b^2)}{2}$ = lb అని తెలుసు. lb = 12 ; $(l - b)^2$ = $(l + b)^2$ - 4lb ప్రకారము $(l - b)^2$ = 49 - 48 = 1 కావున (l - b) = 1, l + b = 7 లను కలుపగా 2l = 8 అగును. కావున l = 4 సెం.మీ

100) a దీ.చ.పొడవు, వెడల్పులు వరుసగా l, b అనుకొంటే $l^2 + b^2 = 25$; (l - b) = 1 అని ఇవ్వబడినది $(l - b)^2 - (l^2 + b^2) = -2lb$ నుంచి 1 - 25 = - 2lb ⇒ lb = 12, $(l + b)^2 = (l - b)^2 + 4lb$ = 1 + 48 ⇒ (l + b) = 7, (l - b) = 1 ల నుంచి l = 4 సెం.మీ అని తెలుస్తుంది.

## చతుర్భుజము - ఘనములు

(రాంబస్, ట్రెపీజియం, సమాంతర చతుర్భుజము, బహుభుజి, సమ, దీర్ఘఘనములు)

1) సమలంబ చతుర్భుజమును -------- అని కూడ అంటారు.

a) సమాంతర చతుర్భుజము  b) రాంబస్
c) ట్రెపీజియం  d) ఇవేవీకావు

2) రాంబస్ వైశాల్యము------

a) 2 × కర్ణముల లబ్ధము  b) $\frac{\text{కర్ణముల పొడవుల మొత్తము}}{2}$
c) కర్ణముల లబ్ధార్ధము  d) ఇవేవీకావు

3) రాంబస్ చుట్టుకొలత

a) 4 × భుజముకొలత  b) $\frac{\text{భుజముపొడవు}}{4}$
c) $\text{భుజము}^2$  d) ఇవేవీకావు

4) రాంబస్‌లోకర్ణముపొడవులు-------

a) సమానము  b) అసమానము
c) ఒకదానికొకటి రెట్టింపు  d) ఇవేవీకావు

5) రాంబస్‌లో కర్ణములుఒకదానికొకటి-------

a) లంబసమద్వి ఖండన చేసికొనును
b) లంబసమద్వి ఖండన చేసికొనవు
c) ఖండించుకొనును
d) ఇవేవీకావు

6) రాంబస్‌లో ఒక్కొక్క కోణము ఇట్లుండవలెను.

a) ఒక లంబకోణము  b) 60°
c) 30°  d) ఇవేవీకావు

7) రాంబస్ వైశాల్యము కనుగొనుటకు కావలసిన కొలతలు

a) కర్ణముల పొడవులు
b) 4 కోణములు
c) భూకొలత మరియు లంబపు ఎత్తు
d) ఇవేవీకావు

8) రాంబస్ యొక్క కర్ణముల కొలతలు వరుసగా 6 సెం.మీ, 8 సెం.మీ. అయిన దాని వైశాల్యము

a) 25 చ.సెం.మీ  b) 24 చ.సెం.మీ
c) 36 చ.సెం.మీ  d) 40 చ.సెం.మీ

9) ఒక రాంబస్ యొక్క కర్ణముల కొలతలు వరుసగా 6 సెం.మీ, 8 సెం.మీ అయిన దాని భుజము పొడవు.

a) 5 సెం.మీ  b) 4 సెం.మీ
c) 6 సెం.మీ  d) ఇవేవీకావు

10) చక్రీయ చతుర్భుజములో ఎదురెదురు కోణముల మొత్తము _______

a) 90°  b) 270°  c) 180°  d) 120°

11) చతుర్భుజములో కోణములు మొత్తము

a) 90°  b) 360°  c) 270°  d) 350°

12) చతుర్భుజ (సమాంతర) వైశాల్యము.

a) భూమి × లంబపు ఎత్తు  b) భూమి+ లంబపు ఎత్తు
c) $\frac{\text{భూమి}}{\text{లంబపు ఎత్తు}}$  d) ఇవేవీకావు

13) ఒక రాంబస్ భుజము 3 సెం.మీ. దాని చుట్టుకొలత

a) 12 సెం.మీ  b) 10 సెం.మీ

c) 24 సం.మీ        d) 18 సెం.మీ

14) ఒక రాంబస్‌లో ఒక కర్ణము పొడవు 8 సెం.మీ. దాని భుజము 5 సెం.మీ. పొడవు కల్గియున్నది. రెండవ కర్ణము పొడవు---

a) 3 సెం.మీ   b) 4 సెం.మీ   c) 6 సెం.మీ   d) ఇవేవీకావు

15) ఒక రాంబస్ వైశాల్యము 36 చ.సెం.మీ. దాని కర్ణము పొడవు8సెం.మీఅయినరెండవకర్ణముపొడవు--------

a) 4.5 సెం.మీ        b) 5 సెం.మీ

c) 9 సెం.మీ        d) 16 సెం.మీ

16) ఒక రాంబస్ వైశాల్యము 24 చ.సెం.మీ. దాని కర్ణముల పొడవుల మొత్తము 14 సెం.మీ అయిన దాని భుజము పొడవు---

a) 3 సెం.మీ   b) 4 సెం.మీ   c) 5 సెం.మీ   d) 6 సెం.మీ

17) ఒక రాంబస్‌లో కర్ణములు ఖండించుకొనగా ఏర్పడ్డ నాలుగు త్రిభుజములలో ఒక త్రిభుజ వైశాల్యము 6 చ.సెం.మీ. అయిన ఆ రాంబస్ వైశాల్యము

a) 12 చ. సెం.మీ        b) 24 చ.సెం.మీ

c) 36 చ.సెం.మీ        d) ఇవేవీకావు

18) సమాంతర చతుర్భుజములో ఎదురెదురు భుజములు -----

a) సమానము మరియు సమాంతరములు

b) సమాంతరములు కావు

c) సమానము కావు

d) ఇవేవీకావు

19) ఒక సమాంతర చతుర్భుజ వైశాల్యము 60 చ.సెం.మీ. అందులోని ఒక భుజము పొడవు 10 సెం.మీ. దీనికి సమాంతరంగా ఉన్న భుజము నుండి ఈ భుజము ----- దూరములో ఉన్నది.

a) 10 సెం.మీ        b) 6 సెం.మీ

c) 8 సెం.మీ        d) ఇవేవీకావు

20) ఒక సమాంతర చతుర్భుజ వైశాల్యము 72 చ.సెం.మీ. రెండు సమాంతర భుజముల మధ్య దూరము 6 సెం.మీ. దాని సంబంధిత భూమి పొడవు ఎంత-------

a) 8 సెం.మీ b) 12 సెం.మీ

c) 15 సెం.మీ d) ఇవేవీకావు

21) ట్రెపీజియంలో భుజముల సంఖ్య------

a) 2 b) 5 c) 4 d) 3

22) ట్రెపీజియంలో కోణముల మొత్తము------

a) 180° b) 270° c) 360° d) ఇవేవీకావు

23) ట్రెపీజియం వైశాల్యము-----

a) $\frac{1}{2}$ × ఎత్తు × సమాంతర భుజముల మొత్తము

b) $\frac{1}{2}$ × సమాంతర భుజముల లబ్ధము × ఎత్తు

c) $\frac{1}{2}$ × సమాంతర భుజముల మొత్తము

d) ఇవేవీకావు

24) ట్రెపీజియంలో సమాంతర భుజముల సంఖ్య-------

a) 2 b) 3 c) 4 d) 1

25) ట్రెపీజియం వైశాల్యము 60 చ.సెం.మీ సమాంతర భుజముల మొత్తము 10 సెం.మీ. అయిన వాటి మధ్య దూరము

a) 15 సెం.మీ b)12 సెం.మీ c) 10 సెం.మీ d) ఇవేవీకావు

26) ఒక ట్రెపీజియంలోని సమాంతర భుజముల మొత్తము 10 సెం.మీ. ఈ భుజముల మధ్యదూరము 5 సెం.మీ దీని వైశాల్యము.

a) 50 చ.సెం.మీ b) 25 చ.సెం.మీ

c) 30 చ.సెం.మీ d) 100 చ.సెం.మీ

27) ఒక ట్రెపీజియం వైశాల్యము 60 చ.సెం.మీ ఒక భుజము 4 సెం.మీ దీనికి మరియు దీని సమాంతర భుజముకు గల మధ్యదూరము 12 సెం.మీ అయిన ఆ భుజము పొడవు.

a) 5 సెం.మీ b) 4 సెం.మీ c) 6 సెం.మీ d) 8సెం.మీ

28) దీర్ఘఘనముయొక్కఘనపరిమాణము---------

a) ( పొడవు + వెడల్పు) ఎత్తు

b) పొడవు × వెడల్పు × ఎత్తు

c) ( పొడవు + ఎత్తు) వెడల్పు

d) పొడవు (వెడల్పు + ఎత్తు)

29) దీర్ఘ ఘనము ప్రక్కతల వైశాల్యము

a) భూపరిధి × ఎత్తు

b) భూపరిధి + ఎత్తు

c) $\frac{\text{భూపరిధి}}{\text{ఎత్తు}}$

d) ఇవేవీకావు

30) దీర్ఘఘనముయొక్కభూపరిధి---------

a) 2( పొడవు × వెడల్పు)

b) 2( పొడవు + వెడల్పు)

c) పొడవు × వెడల్పు

d) ( పొడవు + వెడల్పు)

31) దీర్ఘఘనము యొక్క సంపూర్ణతల వైశాల్యము దాని పొడవు, వెడల్పు, ఎత్తులు వరుసగా l, b, h సెం.మీ అయిన.

a) (lb + bh + lh)

b) 2(lb + bh + lh)

c) (lb + bh)

d) (lb + bh) lh

32) దీర్ఘఘనము పొడవు l, వెడల్పు b, ఎత్తు h అయిన దాని కర్ణము పొడవు

a) $l^2 + b^2 + h^2$

b) $\sqrt{l^2 + b^2 + h^2}$

c) $\sqrt{l^2 + b^2 - h^2}$

d) $l^2 - b^2 + h^2$

33) సమఘనము ఘనపరిమాణము

a) $(\text{భుజము})^2$

b) $(\text{భుజము})^3$

c) 4 × భుజము

d)(భుజము)

34) సమఘనములో భుజముల పొడవులు

a) సమానము

b) అసమానము

c) ఒకటి మరోదానికి రెట్టింపు

d) ఇవేవీకావు

35) సమఘనము యొక్క భుజము పొడవు

a) $\sqrt[4]{\text{ఘనపరిమాణము}}$

b) $\sqrt[3]{\text{ఘనపరిమాణము}}$

c) $\sqrt{\text{ఘనపరిమాణము}}$ d) ఇవేవీకావు

36) సమఘనము యొక్క భూపరిధి

a) 4 × భుజము b) 3 × భుజము

c) 2 × భుజము d) 6 × భుజము

37) సమఘనము యొక్క ప్రక్కతల వైశాల్యము

a) 6 × భుజము$^2$ b) 4 × భుజము$^2$

c) 3 × భుజము$^2$ d) ఇవేవీకావు

38) సమఘనము యొక్క ప్రక్కతల వైశాల్యము

a) 4 × భుజము$^2$ b) 6 × భుజము$^2$

c) 3 × భుజము$^2$ d) ఇవేవీకావు

39) 'a' భుజము కొలత గా గల సమఘనపు కర్ణము పొడవు.

a) 3a b) $\sqrt{3}$ a c) $\sqrt{6}$ a d) 6a

40) ఒక సమఘనము యొక్క భుజము 4 సెం.మీ దాని కర్ణము యొక్క పొడవు

a) $4\sqrt{3}$ సెం.మీ b) $4\sqrt{6}$ సెం.మీ

c) 24 సెం.మీ d) 12 సెం.మీ

41) ఒక సమఘనపు భుజము 2 సెం.మీ. దీని ప్రక్కతల వైశాల్యము

a) 24 సెం.మీ b) 24 చ.సెం.మీ

c) 8 సెం.మీ d) 16 చ.సెం.మీ

42) ఒక సమఘనము యొక్క భుజము కొలత 2 సెం.మీ. దీని సంపూర్ణతల వైశాల్యము

a) 24 సెం.మీ b) 24 చ.సెం.మీ

c) 16 చ.సెం.మీ d) ఇవేవీకావు

43) 4, 3, 2 సెం.మీ కొలతలుగా గల దీర్ఘఘనపు ఘనపరిమాణము

a) 24 సెం.మీ b) 24 ఘ.సెం.మీ

c) 48 ఘ.సెం.మీ d) ఇవేవీకావు

44) 4,3,2 సెం.మీ కొలతలుగా గల ఘనపు ప్రక్కతలవైశాల్యము.

a) 14 చ.సెం.మీ b) 28 చ.సెం.మీ

c) 36 చ.సెం.మీ d) 18 చ.సెం.మీ

45) 4,3,2 సెం.మీ భుజము కొలతలుగా గల దీర్ఘ ఘన సంపూర్ణతల వైశాల్యము

a) 52 చ.సెం.మీ　　b) 14 చ.సెం.మీ

c) 20 చ.సెం.మీ　　d) 18 చ.సెం.మీ

46) 4,3,2 సెం.మీ కొలతలుగా గల ఘనకర్ణము పొడవు ----

a) 16 సెం.మీ　　b) 39 సెం.మీ

c) 20 సెం.మీ　　d) $\sqrt{29}$ సెం.మీ

47) ఒక దీర్ఘఘన ప్రక్కతలవైశాల్యం 50 చ.సెం.మీ. దాని పొడవు 4 సెం.మీ. ఎత్తు 5 సెం.మీ. అయిన దాని వెడల్పు --------

a) 2 సెం.మీ　b) 1 సెం.మీ　c) 3 సెం.మీ　d) 4 సెం.మీ

48) ఒక దీర్ఘఘనపు భూవైశాల్యము 20 చ.సెం.మీ. దాని ఘనపరిమాణము 60 ఘ.సెం.మీ. అయిన దాని ఎత్తు ----

a) 3 సెం.మీ　b) 4 సెం.మీ　c) 2 సెం.మీ　d) 1 సెం.మీ

49) ఒక దీర్ఘఘనపు ఘనపరిమాణము, పొడవు, ఎత్తు ఇచ్చిన దాని వెడల్పు-----

a) $\frac{\text{ఘనపరిమాణము}}{\text{పొడవు} \times \text{ఎత్తు}}$　　b) $\frac{\text{పొడవు} \times \text{ఎత్తు}}{\text{ఘనపరిమాణము}}$

c) $\frac{\text{ఘనపరిమాణము}}{\text{పొడవు}}$　　d) ఇవేవీకావు

50) ఒక దీర్ఘ ఘనము యొక్క ప్రక్కతల వైశాల్యము, ఎత్తు ఇచ్చిన దానిభూపరిధి-------

a) ప్రక్కతలవైశాల్యము × ఎత్తు

b) $\frac{\text{ప్రక్కతలవైశాల్యము}}{\text{ఎత్తు}}$

c) $\frac{\text{ప్రక్కతలవైశాల్యము}}{2 \times \text{ఎత్తు}}$

d) 2 × ఎత్తు × ప్రక్కతలవైశాల్యము

51) ఒక సమఘనము భుజము పొడవు 3 సెం.మీ. దాని భూ పరిధి-----

a) 12 సెం.మీ b) 9 సెం.మీ
c) 6 సెం.మీ d) ఇవేవీకావు

52) ఒక దీర్ఘఘనము యొక్క భూమి పొడవు 6 సెం.మీ. వెడల్పు 5 సెం.మీ ఘనపరిమాణము 90 ఘ.సెం.మీ దాని ఎత్తు.
a) 6 సెం.మీ b) 3 సెం.మీ c) 4 సెం.మీ d) 5 సెం.మీ

53) ఒక దీర్ఘ ఘనము యొక్క భూమి పొడవు 4 సెం.మీ ఎత్తుకూడ 4 సెం.మీ. అయిన వాని ఘనపరిమాణము 48ఘ.సెం.మీదానివెడల్పు-------
a) 5 సెం.మీ b) 4 సెం.మీ c) 3 సెం.మీ d) 2 సెం.మీ

54) 5 సెం.మీ ఎత్తుగల దీర్ఘ ఘనపు పొడవు, వెడల్పులు 2 : 1 నిష్పత్తిలో వున్నవి. దాని ప్రక్కతలవైశాల్యము 90 చ.సెం.మీ అయిన దాని పొడవు.
a) 6 సెం.మీ b) 3 సెం.మీ c) 9 సెం.మీ d) 1 సెం.మీ

55) ఒక దీర్ఘఘనము యొక్క పొడవు, వెడల్పు, ఎత్తులు వరుసగా 5, 4, 2 సెం.మీ అయిన దాని కర్ణము పొడవు.
a) 3 సెం.మీ b) $3\sqrt{5}$ సెం.మీ
c) $5\sqrt{3}$ సెం.మీ d) 4 సెం.మీ

56) 216 ఘ.సెం.మీ ఘనపరిమాణము గల సమఘనము యొక్క భుజము పొడవు.
a) 4 సెం.మీ b) 5 సెం.మీ c) 6 సెం.మీ d) 3సెం.మీ

57) ఒక దీర్ఘఘనపు కర్ణము పొడవు $5\sqrt{2}$ సెం.మీ దాని పొడవు, వెడల్పులు వరుసగా 5 సెం.మీ, 4సెం.మీ. అయిన దాని ఎత్తు------
a) 3 సెం.మీ b) 4 సెం.మీ c) 6 సెం.మీ d) ఇవేవీకావు

58) "సమ చతుర్భుజము" అనుపేరు ఈ క్రింది వానిలో దీనికి కలదు
a) ట్రెపీజియం b) సమాంతర చతుర్భుజము
c) రాంబస్ d) ఇవేవీకావు

59) చతుర్భుజ వైశాల్యమునకు సూత్రము

a) భూమి × ఎత్తు

b) $\frac{1}{2}$ × ఎత్తు (సమాంతర భుజముల మొత్తము)

c) $\frac{1}{2}$ × కర్ణము

d) $\frac{1}{2}$ × కర్ణము × దానిపైకి గీయబడిన అంతర లంబముల మొత్తము.

60) ఒక చతుర్భుజము యొక్క ఒక కర్ణము పొడవు 6 సెం.మీ దాని మీదికి గీయబడిన లంబముల పొడవులు 3 సెం.మీ మరియు 4 సెం.మీ అయిన దాని వైశాల్యము

a) 72 చ.సెం.మీ b) 8చ.సెం.మీ

c) 21 చ.సెం.మీ d) ఇవేవీకావు

61) 70 చ.సెం.మీ వైశాల్యముగల ఒక చతుర్భుజములో ఒక కర్ణము మీదికి గీయబడ్డ లంబముల మొత్తము 10 సెం.మీ అయినదానికర్ణముపొడవు-------

a) 15 సెం.మీ b) 14 సెం.మీ c) 16 సెం.మీ d) ఇవేవీకావు

62) 70 చ.సెం.మీ వైశాల్యముగల చతుర్భుజము యొక్క కర్ణము పొడవు 10సెం.మీ. దానిపైకి గీయబడిన అంతరలంబముల పొడవు మొత్తము.

a) 10 సెం.మీ b) 15 సెం.మీ

c) 14 సెం.మీ d) 16 సెం.మీ

63) ఒక బహుభుజి 'n' భుజములు కలిగియున్నది. దాని అంతరకోణముల మొత్తము ------- లంబకోణములుగా చెప్పవచ్చును.

a) (n - 4) b) 2n - 4) c) (3n - 4) d) ఇవేవీకావు

64) బహుభుజియొక్క బాహ్య కోణము కనుగొనవలెనన్న 360° లనుదానిభుజములసంఖ్యచే-------

a) భాగింపవలెను b) గుణించవలెను

c) కలపవలెను d) ఇవేవీకావు

65) ఒక బహుభుజి 36° లు బాహ్యకోణము గల్గిన -------- భుజములు కల్గి ఉండును.

a) 8 b) 10 c) 6 d) 12

66) బహుభుజి యొక్క బాహ్య, అంతర కోణముల మొత్తము ----

a) 90° b) 120° c) 180° d) ఇవేవీకావు

67) ఒక బహుభుజి యొక్క ఒక బాహ్యకోణము 60• అయిన దాని అంతరకోణము-------

a) 130° b) 120° c) 110° d) 100°

68) ఒక బహుభుజి యొక్క బాహ్యకోణము 60• అయిన దానికి గలభుజములసంఖ్య-------

a) 5 b) 6 c) 7 d) 8

69) ఒక బాహుభుజి యొక్క అంతరకోణము 120° దీని బాహ్యకోణము మరియు భుజముల సంఖ్యలు వరుసగా -----

a) 60°, 6 b) 50°, 5 c) 90°, 4 d) ఇవేవీకావు

70) ఒక బహుభుజి యొక్క ఒక బాహ్యకోణము 60° దీనిని ఈ ఆకారముగా పిలుస్తాము

a) క్రమఅష్టభుజి b) క్రమషడ్భుజి

c) పెంటగాన్ d) ఇవేవీకావు

71) ఒక బహుభుజి 8 భుజములు కల్గియున్నది. దాని ఒక్కొక్క బాహ్యకోణము-----

a) 50° b) 45° c) 60° d) 38°

72) క్రమషడ్భుజినిఆరు-------- గావిభజించవచ్చును

a) సమద్విబాహు త్రిభుజము b) విషమబాహు త్రిభుజములు

c) సమబాహుత్రిభుజములు d) ఇవేవీకావు

73) క్రమషడ్భుజి వైశాల్యము నిట్లు వ్రాయగలము.

a) $6\sqrt{s(s-a)(s-b)(s-c)}$ b) $6 \times \frac{\sqrt{3}}{4} \times$ భుజము$^2$

c) భూమి × ఎత్తు d) ఇవేవీకావు

73a) ఒక క్రమషడ్భుజి 5 సెం.మీ భుజము పొడవు కల్గియున్నది. దీని అంతరకోణము--------

a) 30° b) 60° c) 50° d) 120°

74) ఒక క్రమషడ్భుజి 2సెం.మీ. భుజము పొడవు కల్గియున్నది. దాని వైశాల్యము

a) $3\sqrt{3}$ చ.సెం.మీ  b) $6\sqrt{3}$ చ.సెం.మీ

c) $2\sqrt{3}$ చ.సెం.మీ  d) ఇవేవీకావు

75) ఒక క్రమషడ్భుజి వైశాల్యము $6\sqrt{3}$ చ.సెం.మీ. దాని భుజము పొడవు

a) 3 సెం.మీ  b) 6 సెం.మీ  c) 2 సెం.మీ  d) ఇవేవీకావు

76) 10 భుజములు గల బహుభుజి యొక్క అంతరకోణముల మొత్తము———

a) 15 లంబకోణములు  b) 16 లంబకోణములు

c) 10 లంబకోణములు  d) ఇవేవీకావు

77) ఒక రాంబస్ యొక్క ఒక కోణము 80° ~~ఈ~~కోణమునకు ఎదురుగా గల కోణము విలువ

a) 100°  b) 80°  c) 72°  d) 40°

78) ఒక రాంబస్ యొక్క ఒక కోణము 60° అయిన మిగిలిన కోణములు——— , ——— , ——— లు

a) 120°, 60°, 120°  b) 90°, 60°, 120°

c) 130°, 60°, 110°  d) ఇవేవీకావు

79) ఒక బహుభుజి అంతరకోణము 108° దీని భుజముల సంఖ్య

a) 5  b) 6  c) 110°  d) ఇవేవీకావు

80) ఒక సమాంతర చతుర్భుజము 40 చ.సెం.మీ. వైశాల్యము కల్గియున్నది. దాని ఎత్తు 10 సెం.మీ దాని భుజము ———

a) 4 సెం.మీ  b) 5 సెం.మీ  c) 2 సెం.మీ  d) ఇవేవీకావు

## జవాబులు

1) c  2) c  3) a  4) b

5) a  6) d  7) a

8) $\frac{1}{2} \times 6 \times 8 = 24$ చ. సెం.మీ

9) రాంబస్ కర్ణముల ఒకదానినొకటి లంబసమద్విఖండన చేసికొంటాయి. కాబట్టి రెండు కర్ణములపొడవులలో సగము, సగము విలువలు వ్రాస్తే, అవి లంబకోణ త్రిభుజ భుజములగును. మరియు రాంబస్ భుజము కర్ణముగా అగును. అప్పుడు పైథాగరస్ సిద్ధాంతము నుండి సాధిస్తాము. ఈ విధంగా వ్రాస్తే, భుజములు వరుసగా $\frac{6}{2}, \frac{8}{2}$ అనగా 3, 4 సెం.మీ అగును. కావును ఆ భుజము పొడవు $= \sqrt{3^2 + 4^2}$ $= \sqrt{25} = 5$ సెం.మీ కావున జవాబు a.

10) c 11) b 12) a 13) a

14) తొమ్మిదవ సమస్యలోవలెసాధించాలి. ఇక్కడ కర్ణము పొడవు = 8 సెం.మీ. భుజము పొడవు 5 సెం.మీ అని ఇవ్వబడ్డాయి కావున కర్ణము పొడవులో సగము ఒక భుజము కొలత మరియు రాంబస్ భుజము కొలత లంబకోణ త్రిభుజపు కర్ణము అగును. కావున రెండవ భుజము $= \sqrt{25 - 16} = \sqrt{9}$ $= 3$ సెం.మీ అనగా దాని రెండవ కర్ణము కొలత $= 2 \times 3 =$ 6 సెం.మీ. కావున జవాబు c.

15) c కారణము :- $\frac{1}{2} \times 8 \times$ రెండవకర్ణము $= 36 \Rightarrow$ రెండవకర్ణము $= \frac{36 \times 2}{8} = 9$ సెం.మీ

16) c రాంబస్ కర్ణముల పొడవుల వరుసగా a, b అనుకుంటే $\frac{1}{2} ab = 24$ అనియు $(a + b) = 14$ సెం.మీ. అనియు ఇవ్వబడినది. $(a - b)^2 = (a + b)^2 - 4ab$ అని వ్రాస్తే $(a - b)^2 =$ $196 - 2 \times 96 = 4$ అవుతుంది. అనగా $(a - b) = 2$ సెం.మీ. $(a + b) = 14$ ల నుండి $2a = 16 \Rightarrow a = 8$ సెం మీ అగును. ఇప్పుడు తొమ్మిదవ సమస్యవలె సాధిస్తేభుజము పొడవు 5 సెం.మీ అని తెలుస్తుంది.

17) b రాంబస్ వైశాల్యము $= 4 \times 6 = 24$ చ.సెం.మీ

18) a

19) [illegible]

ఎత్తు = [illegible]

20) b  21) c  22) c  23) a  24) a

25) b $\frac{1}{2}$ × ఎత్తు × 10 = 60 కావున ఎత్తు = 12 సెం.మీ

26) b $\frac{1}{2} \times 10 \times 5 = 25$ చ.సెం.మీ

27) c ఇవిలో ఎత్తు = 12 సెం.మీ ఒక భుజము 4 సెం.మీ రెండవ సమాంతర భుజము కొలత x సెం.మీ అనుకుంటే $\frac{1}{2} \times 12\,(4 + x) = 60 \Rightarrow (4 + x) = 10$ అగును దీని నుండి $x = 10 - 4 = 6$ సెం.మీ తెలుస్తుంది.

28) b  29) a  30) b  31) b
32) b  33) b  34) a  35) b
36) a  37) b  38) a  39) b
40) a  41) d  42) b  43) b

44) b 2 × ఎత్తు (పొడవు + వెడల్పు) = 2 × 2 × 7 = 28 చ.సెం.మీ

45) a 2(lb + bh + lh)నుండి 2(12 + 6 + 8) = 2 × 26 = 52 చ.సెం.మీ

46) d $\sqrt{l^2 + b^2 + h^2}$ నుండి $\sqrt{16 + 9 + 4} = \sqrt{29}$

47) b 2 × ఎత్తు (పొడవు + వెడల్పు) = 2× 5 (4 + వెడల్పు) = 50 , (4 + వెడల్పు) = 5 ⇒ వెడల్పు = 1సెం.మీ

48) a భూవైశాల్యము x ఎత్తు = ఘనపరిమాణము కావున 20 × ఎత్తు = 60 ఎత్తు = $\frac{60}{20}$ = 3 సెం.మీ

49) a  50) b  51) a  52) b పొడవు, వెడల్పు, ఎత్తుల లబ్ధము = ఘనపరిమాణమునుండి ఎత్తు = $\frac{\text{ఘనపరిమాణము}}{\text{పొడవు} \times \text{వెడల్పు}} = \frac{90}{6 \times 5} = 3$ సెం.మీ

53) $\frac{\text{ఘనపరిమాణము}}{\text{పొడవు} \times \text{ఎత్తు}}$ = వెడల్పు

54) a నిష్పత్తి స్థిరాంకము x అనుకుంటే పొడవు 2x, వెడల్పు x అగును కావున $2 \times 5\ (2x + x) = 90 \Rightarrow 3x = 9 \Rightarrow x = 3$ కావున దాని పొడవు $2 \times 3 = 6$ సెం.మీ

55) b కర్ణము పొడవు $= \sqrt{5^2 + 4^2 + 2^2}$
$= \sqrt{25 + 16 + 4} = \sqrt{45} = 3\sqrt{5}$ సెం.మీ

56) c (భుజము)$^3$ = 216 చ.సెం.మీ ; భుజము $= \sqrt[3]{216} = 6$ సెం.మీ

57) a $\sqrt{l^2 + b^2 + h^2} = 5\sqrt{2}$ అని ఇవ్వబడింది.
$\sqrt{5^2 + 4^2 + h^2} = 5\sqrt{2}$ అనగా $\sqrt{41 + h^2} = 5\sqrt{2} \Rightarrow 41 + h^2$
$50 \Rightarrow h^2 = 9 \Rightarrow h = 3$ సెం.మీ

58) c 59) d

60) c $\frac{1}{2} \times 6(4 + 3) = \frac{1}{2} \times 6 \times 7 = 21$ చ.సెం.మీ

61) b కర్ణము పొడవు $= \frac{2 \times \text{చతుర్భుజవైశాల్యము}}{\text{అంతరలంబములమొత్తము}}$
$= \frac{2 \times 70}{10} = 14$ సెం.మీ

62) c అంతరలంబముల మొత్తము పొడవు
$\frac{2 \times \text{చతుర్భుజవైశాల్యము}}{\text{దానికర్ణముల పొడవు}} = \frac{2 \times 70}{10} = 14$ సెం.మీ

63) b 64) a 65) b 66) c 67) b

68) b 69) a 70) b 71) b $\frac{360}{8} = 45°$

72) c 73) b 73a) d

74) b కారణము :- $\frac{6 \times \sqrt{3}}{4} \times 2^2 = 6\sqrt{3}$ చ.సెం.మీ

75) c $\frac{6\sqrt{3}}{4} \times (\text{భుజము})^2 = 6\sqrt{3} \Rightarrow (\text{భుజము})^2 = \frac{6\sqrt{3}}{6\sqrt{3}} \times 4 =$ 4 కావున భుజముల పొడవు = $\sqrt{4} = 2$ సెం.మీ

76) b బహుభుజి అంతరకోణాల మొత్తము = (2 × 10−4) లంబకోణాలు = 16 లంబకోణములు.

77) b రాంబస్‌లో ఎదుటికోణములు సమానము

78) a ఎదురెదురు కోణాలు సమానము కావున రెండు ఎదురు కోణముల మొత్తము (60 + 60) ఇక మిగిలిన కోణముల మొత్తము (360 −120) = 240° కావున మిగిలిన రెండుకోణములు ఒక్కొక్కటి $\frac{240}{2} = 120^\circ$ అనగా ఆకోణములు 60°, 120°, 60°, 120° లు.

79) బహుభుజి బాహ్యకోణము (180 − 108) = 72°; దీని భుజముల సంఖ్య = $\frac{360}{72} = 5$ అనగా ఇది 5 భుజములు కల్గియుండును. కావున a

80) a భుజము = $\frac{\text{సమాంతర చతుర్భుజవైశాల్యము}}{\text{ఎత్తు}} = \frac{40}{10} = 4$ సెం.మీ

## వృత్తములు – కంకణములు

1) వృత్తము యొక్క కేంద్రమునుండి, దానిపరిధిపై గల బిందువుకున్న దూరము ------ కు సమానము
   a) వ్యాసము    b) వ్యాసార్థము
   c) 2 × వ్యాసము    d) ఇవేవీకావు

2) వృత్తము ఒక ------
   a) 2-D పిక్చరు    b) 3-D పిక్చరు
   c) 4-D పిక్చరు    d) ఇవేవీకావు

3). వృత్తకేంద్రము వద్దగల కోణము ------
   a) 90°    b) 180°    c) 270°    d) 360°

4) వృత్తమునకు ఒక స్పర్శరేఖగీస్తే, ఈ రేఖ వ్యాసార్థములు ఒక దాని కొకటి -----

a) లంబముగా ఉంటాయి b) $30^\circ$ కోణంలో ఉంటాయి

c) $60^\circ$ ల కోణము చేస్తాయి d) ఇవేవీకావు

5) వృత్త పరిధికి సూత్రము ($\because$ r = వృత్తవ్యాసార్థము)

a) $2\pi r$ b) $2\pi r^2$ c) $3\pi r$ d) $\pi r^2$

6) వృత్తవ్యాసము, అవృత్తవ్యాసార్థమునకు -----

a) రెండురెట్లు b) రెట్టింపు

c) సగము d) ఇవేవీకావు

7) ఒక వృత్తవ్యాసము d సెం.మీ దాని పరిధి.

a) $2\pi d$ సెం.మీ b) $\pi d$ సెం.మీ

c) $\frac{d}{2}$ సెం.మీ d) ఇవేవీకాదు

8) వృత్తవ్యాసము d సెం.మీ అయిన ఆ వృత్త వ్యాసార్థము

a) 2d సెం.మీ b) 3d సెం.మీ

c) $\frac{d}{2}$ సెం.మీ d) ఇవేవీకావు

9) ఒక వృత్తవ్యాసమును, దాని వ్యాసార్థముచే భాగిస్తే వచ్చే సంఖ్య -----

a) 3 b) 4 c) 2 d) 1

10) ఒక వృత్త వ్యాసార్థము (r) దాని వైశాల్యము -----

a) $2\pi r$ b) $2\pi r^2$ c) $\pi r^2$ d) ఇవేవీకావు

11) ఒక వృత్త వ్యాసము 'd' దాని వైశాల్యము -----

a) $4\pi d^2$ b) $\frac{\pi d^2}{4}$ c) $2\pi d^2$ d) ఇవేవీకావు

12) $\pi$ విలువ

a) $\frac{7}{22}$ b) $\frac{22}{7}$ c) $\frac{1}{7}$ d) ఇవేవీకావు

13) ఒక వృత్తము 2 సెం.మీ వ్యాసార్థము కలిగియున్నది. దాని పరిధి -----

a) $4\pi$ b) $2\pi$ c) $6\pi$ d) ఇవేవీకావు

14) ఒక వృత్త పరిధి, దాని వైశాల్యములు సమానము అయిన దాని వ్యాసార్థము -----

a) 2 సెం.మీ b) 4 సెం.మీ c) 1 సెం.మీ d) 3 సెం.మీ

15) ఒక వృత్త వ్యాసార్థము 14 సెం.మీ దాని వైశాల్యము -----

a) 616 చ.సెం.మీ b) 154 చ.సెం.మీ

c) 88 చ.సెం.మీ d) 44 చ.సెం.మీ

16) ఒక వృత్తాకారపు అట్టను నాలుగుసార్లు త్రిప్పగా 88 సెం.మీ దూరము పోయింది. అయిన ఆ వృత్తపు వ్యాసము -----

a) 7 సెం.మీ b) 3.5 సెం.మీ

c) 14 సెం.మీ d) 8 సెం.మీ

17) ఒక వృత్తము 4 సెం.మీ. వ్యాసార్థము కల్గియున్నది. వేరొక వృత్తము దీనికి రెట్టింపు వ్యాసార్థము కలిగియున్నది. అయిన ఆ రెండు వృత్తములు యొక్క పరిధుల నిష్పత్తి -----

a) 1 : 3 b) 1 : 2 c) 3 : 2 d) 2 : 3

18) 616 చ.మీ వృత్తవైశాల్యముగా గల వృత్తము యొక్క వ్యాసము -----

a) 28 మీ b) 28 సెం.మీ

c) 14 మీ d) 14 సెం.మీ

19) ఒకవృత్తపరిధి 88 మీ. అయిన దాని వ్యాసము -----

a) 28 మీ b) 14 మీ c) 28 సెం.మీ d) 15 మీ

20) అర్ధవృత్త పరిధి (r దాని వ్యాసార్థము)

a) $\frac{36r}{7}$ b) $\pi r^2$ c) $\pi r$ d) $2\pi r$

21) అర్ధవృత్తము 'r' వ్యాసార్థము గల్గియున్నచో దాని వైశాల్యము -----

a) $\frac{\pi r^2}{2}$ b) $\pi r^2$ c) $2\pi r$ d) $\pi r$

22) ఒక అర్ధవృత్త పరిధి $\frac{36}{7}$ మీ. అయిన దాని వ్యాసార్థము -----

a) 2 మీ b) 1 మీ. c) $\frac{1}{2}$ మీ d) ఇవేవీకావు

23) ఒక అర్ధవృత్తవైశాల్యము $2\pi$ చ. సెం.మీ. దాని వ్యాసార్ధము --
a) 4 సెం. మీ b) 2 సెం.మీ c) 1 సెం.మీ d) ఇవేవీకావు.

24) ఒక అర్ధవృత్త పరిధి, దాని వైశాల్యములు సమానమైన, దాని వ్యాసార్ధము----------
a) $\frac{36}{22}$ యూ b) $\frac{36}{11}$ యూ c) 3 యూ d) ఇవేవీకావు

25) ఒక అర్ధవృత్తపరిధి, దాని వైశాల్యములో 11 వ వంతు ఉన్నది. దాని వ్యాసార్ధము ----------
a) 18 సెం.మీ b) 36 సెం.మీ c) 54 సెం.మీ d) ఇవేవీకావు.

26) ఒక వృత్త వైశాల్యము, మరియొక అర్ధవృత్త వైశాల్యమునకు సమానముగా నున్నది ఆ వృత్త వ్యాసార్ధము ($r_1$) అర్ధవృత్త వ్యాసార్ధము ($r_2$) ల నిష్పత్తి ------
a) $2r_1 : r_2$ b) $\sqrt{2} : 1$ c) $1 : \sqrt{2}$ d) ఇవేవీకావు

27) కంకణము యొక్క వైశాల్యము ----------
a) (బయట వృత్త వైశాల్యము – లోపలి వృత్త వైశాల్యము)
b) $\frac{\text{బయటి వృత్తవైశాల్యం}}{\text{లోపలివృత్త వైశాలం}}$
c) (బయటి వృత్త వైశాల్యము + లోపలి వృత్త వైశాల్యము)
d) ఇవేవీకావు

28) ఒక కంకణము యొక్క బయట వృత్తవైశాల్యము) 400 చ.మీ.లు. లోపలి వృత్తవైశాల్యము 150 చ.మీ. అయిన ఆ కంకణము వైశాల్యము--------
a) 200 చ.మీ b) 500 చ.మీ
c) 550 చ.మీ d) 250 చ.మీ

29) కంకణాకార స్థలవైశాల్యము 100 చ.మీ. లోపలి వృత్తవైశాల్యము 300 చ.మీ. అయిన బయటి వృత్త వైశాల్యము----------
a) 200 చ.మీ b) 400 చ.మీ
c) 300 చ. మీ d) 100 చ.మీ.

30) ఒక కంకణాకార స్థలవైశాల్యము b చ.యూ. లోపలి వృత్తవైశాల్యము a చ.యూ అయిన బయటి వృత్తవైశాల్యము ---------

a) (a+b) చ. యూ    b) (b - a) చ.యూ
c) (a - b) చ. యూ    d) ఇవేవీకావు

31) లోపలి వృత్త వైశాల్యము b చ.యూ. కంకణము వైశాల్యము b చ.యూ. అయిన, బయటి వృత్త వైశాల్యము ---------

a) (a + b) చ.యూ    b) (a - b) చ.యూ
c) (b - a) చ.యూ    d) ఇవేవీకావు

## జవాబులు

1) b  2) a  3) d  4) a  5) a
6) b  7) b  8) c  9) c  10) c
11) b  12) b  13) a

14) a $2\pi r = \pi r^2$ అని ఇవ్వబడినది. కావున $r = 2$ సెం.మీ కావలెను.

15) a వృత్తవైశాల్యము $= \pi r^2$ కావున $\frac{22}{7} \times 14 \times 14 = 616$ చ. సెం మీ.

16) a ఒకసారి త్రిప్పిన దాని చుట్టుకొలత అనగా పరిధి అంతదూరము పోతుంది. 4 సార్లు తిరిగిన $4 \times 2\pi r$ దూరము పోవును. కనుక $4 \times 2 \times \frac{22}{7} \times r = 88$ సెం.మీ $\Rightarrow 2r = 88 \times \frac{7}{22} \times \frac{1}{4} = 7$ సెం.మీ. కావున వ్యాసము $(2r) = 7$ సెం.మీ.

17) b మొదటి వృత్తపరిధి $= 2 \times \pi \times 4$; రెండవ వృత్తపరిధి $= 2 \times \pi \times 8$ వీని నిష్పత్తి $= 2\pi \times 4 : 2 \times \pi \times 8 = 1 : 2$ అగును.

18) a $\pi r^2 = 616$ చ.మీ. $r^2 = \frac{616}{22} \times 7 = 28 \times 7 \Rightarrow r = 14$ మీ. వ్యాసము $= 2r$ కావున వ్యాసము $= 28$ మీ. అవుతుంది.

19) a $2\pi r = 88$ మీ. కావున $2r = \frac{88}{22} \times 7 = 28$ మీ...

20) [illegible]

22) b [illegible] అని ఇవ్వబడింది. కావున $r = 1$ మీ.

23) b అర్ధవృత్త వైశాల్యము $\frac{\pi r^2}{2} = 2\pi$ అని ఇవ్వబడింది. $r^2 = 4$
$\Rightarrow r = 2$ సెం.మీ

24) b $\frac{36r}{7} = \frac{\pi r^2}{2} \Rightarrow \frac{36}{7} = \frac{\pi r}{2}$ అగును. కావున $r = \frac{36 \times 2}{7} \times \frac{7}{22}$
$= \frac{36}{11}$ యూ.

25) d $\frac{\pi r^2}{2}$ అర్ధవృత్తవైశాల్యము, $\frac{36r}{7}$ = అర్ధవృత్తపరిధి. కావున
$\frac{36r}{7} = \frac{\pi r^2}{22}$ అని ఇవ్వబడింది. $\left(\frac{\pi r^2}{2 \times 11} = \frac{\pi r^2}{22}\right.$ కనుక $\left.\right)$ $\frac{36}{7}$
$= \frac{22 \times r^2}{7 \times 22} \Rightarrow r^2 = 36$ అనగా $r = 6$ యూ

26) c వృత్త వైశాల్యము $(\pi r_1^2)$ = అర్ధవృత్త వైశాల్యము $\pi r_2^2$ అని
ఇవ్వబడినది $2r_1^2 = r_2^2$ అగును. అనగా $\sqrt{2}\ r_1 = r_2$
అవుతుంది. కావున $r_1 : r_2 = 1 : \sqrt{2}$ అగును. ఇందులో $r_1$,
$r_2$ లు వృత్త, అర్ధవృత్త వ్యాసార్ధములు

27) a

28) కంకణము వైశాల్యము = (బయటి వృత్త వైశాల్యము – లోపలి
వృత్తవైశాల్యము); కావున జవాబు d

29) b బయటి వృత్తవైశాల్యము = (కంకణము వైశాల్యము +
లోపలి వృత్తవైశాల్యము) = 300 + 100 = 400 చ.మీ.

30) a బయటి వృత్తవైశాల్యము = కంకణము వైశాల్యము +
లోపలి వృత్తవైశాల్యము. కావున (b + a) చ.యూ.
అవుతుంది.

31) a బయటి వృత్త వైశాల్యము = లోపలి వృత్త వైశాల్యము +
కంకణము వైశాల్యము.